

టిబెట్టుదేశ చిత్రకారుడు రచించిన నాగార్జునుని వర్ణ చిత్రానికి ఇది ఛాయాచిత్రం.

# విషయ సూచిక



---

ముఖ చిత్రం :

నాగార్జునసాగర్ ఆనకట్ట నిర్మింపబడనున్న స్థలం దృశ్యం. ఈ స్థలాన్ని రాష్ట్ర ముఖ్యమంత్రి డా. బి. రామకృష్ణారావుగారు ౧౯౫౫ ఆగస్టు నెల మూడవ వారంలో సందర్శించారు.

---


హైదరాబాదు సమాచార పౌరసంబంధముల శాఖ డైరెక్టరుచే ప్రచురింపబడి, హైదరాబాదు ప్రభుత్వ ముద్రణాలయంలో ముద్రింపబడినది.

# GOVERNMENT OF INDIA PUBLICATIONS FOR SALE

| No. | Title | | | Rs. | a. | p. |
|---|---|---|---|---|---|---|
| 1. | India—A Pictorial Survey | .. | .. | 10 | 0 | 0 |
| 2. | Hyderabad (Big) .. | .. | .. | 1 | 8 | 0 |
| 3. | Hyderabad—See India Series | .. | .. | 0 | 8 | 0 |
| 4. | Muslims in India .. | .. | .. | 0 | 10 | 0 |
| 5. | Facts about India .. | .. | .. | 3 | 8 | 0 |
| 6. | About India .. | .. | .. | 1 | 8 | 0 |
| 7. | Panorama of India .. | .. | .. | 1 | 0 | 0 |
| 8. | India—1955 (Reference Annual) | .. | .. | 7 | 8 | 0 |
| 9. | Challenge to Democracy | .. | .. | 0 | 8 | 0 |
| 10. | Jawaharlal Nehru's Speeches—1949-53 | | .. | 8 | 8 | 0 |
| 11. | Independence and After | .. | .. | 7 | 8 | 0 |
| 12. | Indian Art through the Ages | .. | .. | 12 | 8 | 0 |
| 13. | Mahatma Gāndhi Album | .. | .. | 35 | 0 | 0 |
| 14. | 5,000 Years of Architecture | .. | .. | 2 | 0 | 0 |
| 15. | India's National Laboratories | .. | .. | 1 | 8 | 0 |
| 16. | Asian African Conference | .. | .. | 0 | 8 | 0 |
| 17. | Children's Films .. | .. | .. | 0 | 8 | 0 |
| 18. | Bharat Milap .. | .. | .. | 0 | 8 | 0 |
| 19. | Contemporary Indian Painters | .. | .. | 5 | 8 | 0 |
| 20. | Law for the Layman .. | .. | .. | 1 | 0 | 0 |
| 21. | Nutrition .. | .. | .. | 0 | 8 | 0 |
| 22. | Social Security .. | .. | .. | 0 | 4 | 0 |
| 23. | Technical Assistance .. | .. | .. | 0 | 10 | 0 |
| 24. | Acharya Vinoba Bhave | .. | .. | 1 | 0 | 0 |
| 25. | Kangra Valley Paintings | .. | .. | 18 | 0 | 0 |
| 26. | Road to a Welfare State | .. | .. | 0 | 8 | 0 |
| 27. | Rural Industries .. | .. | .. | 0 | 8 | 0 |
| 28. | Progress of Land Reform | .. | .. | 0 | 6 | 0 |
| 29. | Framework of Second Five-Year Plan | | .. | 0 | 12 | 0 |

Available from:—

**PUBLICATIONS SECTION,**

**Department of Information and Public Relations,**

**Hyderabad-Deccan—1.**

# నాగార్జునసాగర్



## కృష్ణానదిపై బహుళార్థ సాధక ప్రాజెక్టు

**రచన :—కపిల కాశీపతి**

నాగార్జున సాగర్ !

కృష్ణానదిపై హైదరాబాదు—ఆంధ్ర ప్రభుత్వాలు ౧౨౨ కోట్ల రూపాయల ఖర్చుతో ఉమ్మడిగా నిర్మించనున్న బహుళార్థ సాధకమైన ప్రాజెక్టుకు అధికారయుతంగా పెట్టబడిన పేరిది. ఈ ప్రాజెక్టు నిర్మాణం తొమ్మిదేండ్లలో పూర్తి అవుతుంది. అప్పుడిది ౧౧౦ చదరపు మైళ్ళ జలాశయంగా భారత దేశంలో రెండవ పెద్ద ప్రాజెక్టుగా శాశ్వతమైన నీటివసరుగా రూపొందుతుంది.

ఈపేరు మనల్ని పదునెనిమిది వందల సంవత్సరాల క్రిందటి గతాన్ని స్మరింపజేస్తుంది. అది ఒక్క భారత దేశానికే గాక యావత్తు ఆసియా ఖండానికి మహోజ్జ్వలమైన కాలం. ఐహికాముష్మిక భావాల సమన్వయంతో స్త్రీ పురుషులు ఉత్తమమైన జీవితం గడుపగలిగిన శుభదినాలవి.

ఈపేరు మళ్ళీ మనకు ప్రాణాధారాలైన నీరు, వెలుతురు ఇచ్చి వెయ్యి సంవత్సరాల ముందుకు గొనిపోతుంది. నిప్పచ్చరమై ఎండి, బీడువడిపోయి నీటికొరకు కల్లాడుతున్న కృష్ణా లోయ ప్రాంత ప్రజలకు ఇది మళ్ళీ నాడు పూర్వీకు లనుభవించిన సిరి సంపదలను లభింపజేసి ఆ ప్రాంతాన్ని నిత్యకల్యాణం పచ్చతోరణంగా విలసిల్లజేస్తుంది.

నాగార్జున సాగర్—ఈ పేరు యుగయుగాల ఆమంత్రణంలో వినబడుతున్నది. ఒక్క పేరులో ఇది భూతభవిష్యత్కాలాలను వర్తమాన కాలంతో ముడివేస్తున్నది.

నాగార్జున సాగరం గౌతమ బుద్ధుడు మొదలు మహాత్మా గాంధీ వరకు, అశోక చక్రవర్తి మొదలు ప్రధాన మంత్రి నెహ్రూ వరకు అవిచ్ఛిన్నమైన భారత వారసత్వానికి దర్పణం.



### నాగార్జునుడు

ఏ మహాపురుషుని పేరిట ఈ ప్రాజెక్టుకు నామకరణ చేయబడిందో ఆయన పురాణాలలోని కల్పిత వ్యక్తి కాడు. ఆయన నిజమైన వ్యక్తి; ప్రాచ్యఖండ చరిత్రలో మహా మహుడు



నాగార్జున సాగర్ ఆనకట్ట—ఒక చిత్రకారుని ఊహాచిత్రం



విద్యాలయాలు — ధ్వజకొండ పెద్దరోడ్డు నుంచి నాగార్జునసాగర్ ...

నలందా విశ్వవిద్యాలయం (క్రీ.శ. ౬౭౫—౮౫) లో కొంత కాలం ఆచార్యుడుగా పనిచేసిన చీనా యాత్రికుడు ఇ-ట్సింగ్ వ్రాసిన దానినిబట్టి నాగార్జునుడు క్రీ.శ. మొదటి శతాబ్దం వాడని, కనిష్క చక్రవర్తి కలడు సమకాలికుడని తెలుస్తున్నది. చీనా దేశస్థులు నాగార్జునున్ని లంగ్‌షు లేక లంగ్‌మెంగ్ అంటారు. టిబెట్టు దేశంలో లభించే ఆధారాలనుబట్టి, ఒకప్పుడు బ్రాహ్మణ సంస్కృతికి ప్రసిద్ధమైనట్టి విదర్భ (బేరారు) లో నాగార్జునుడు జన్మించినట్లు తెలుస్తున్నది. ఆయన అర్జున వృక్షం క్రింద జన్మించాడనీ, నాగా తెగవార్ల ఆయనకు విద్యాభ్యాసం చేశారనీ, అందుచేతనే ఆయనకు నాగార్జునుడని పేరు వచ్చిందనీ అంటారు. ఆయన గురువులలో రాహులుడొకడు. పిన్న ప్రాయంలోనే నాగార్జునునిపై మగధ దేశంలోని నలేంద్ర బౌద్ధ విశ్వవిద్యాలయ పీఠాధిపతి శ్రీశరణ భద్రుని ప్రభావం పడింది. అంతట ఈయన బౌద్ధ మతం పుచ్చుకొని, విజ్ఞాన శాస్త్రములో నిధియై విశ్వవిద్యాలయాధిపతి అయ్యాడు. ఆ తరువాత ఈయన ప్రభావము అనేక మంది యువరాజులపై పడింది. ఆ రాజుల్లో కొందరి కాలంలోనే ... ఉన్నారు. ... రాజులలో ఒక్కరాజు మంజా, మహేశ్వరా భోజుడు కూడా ఉన్నాడు. క్రీ. శ. ౬౩౦ నుంచి ౬౪౫ వరకు భారత దేశంలో పర్యటించిన చీనా యాత్రికుడు హ్యూన్‌సాంగ్ నాగార్జునుని శిష్యులలో ఆర్య దేవుడు కూడా కలడని వ్రాశాడు. నాగార్జునుడు గొప్ప రసాయన శాస్త్రజ్ఞుడు. వివిధ పదార్థములను మేళవించి వేరొక పదార్థమును సృష్టించుటలో సిద్ధహస్తుడు. ఈయన పదార్థ పరివర్తన సిద్ధాంతమును ఇప్పటి అణుశాస్త్రజ్ఞులు కూడా అంగీకరిస్తున్నారు. ఈయన బంగారం చేసేవాడని ప్రతీతి. ఆ బంగారాన్ని విదేశాలకు పంపి దానికి బదులుగా ధాన్యాన్ని తెప్పించి కరువు కాటకాలతో అలమటిస్తున్న దేశీయులను పోషించేవాడట. ఈయన దక్షిణ భారతంలో అనేక బంగారు గనులను కూడా కనిపెట్టాడు. "రసాయనశాస్త్రము వున్నంతవరకు పేదరికం, రోగాలు, మానవుణ్ణి బాధించలేవని" ఇతని విశ్వాసం. ఈయన గొప్ప వైద్యుడు కూడా. ప్రత్యే

కంగా నేత్ర చికిత్సలో ప్రవీణుడు. మానవుని ఆయుస్సును అధికం చేయడానికి ఒక ప్రక్రియను కనిపెట్టి దానిని కొందరి కాయన ఇచ్చినట్లు కూడా తెలుస్తున్నది.

నాగార్జునుడు గొప్ప తాత్వికుడు కూడా. బౌద్ధమతంలో మహాయాన శాఖకితడు స్థాపకుడు. ఈ మహాయాన సంప్రదాయం కొంతకాలానికి టిబెట్టు, చీనా, మంగోలియా, కొరియా, జపాను దేశాలకు కూడా వ్యాపించింది. బుద్ధుడు నెలకొల్పిన హీనాయాన సంప్రదాయం భారత దేశంలోనే వృద్ధిగాంచింది. టిబెట్టు, చీనా సారస్వతాలలో నాగార్జునుని పేరు కన్పిసుంది. ఆ సారస్వతాలను బట్టి, నాగార్జునుడు ఆంధ్ర రాష్ట్రంలోని గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలో మాచెర్ల రైలు స్టేషనుకు పశ్చిమాన ౧౬ మైళ్ళ దూరాన వున్న



నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణంకొరకై హైదరాబాదు రాష్ట్రంపైపున నాంది ప్రస్తావనగా ముఖ్యమంత్రి డా. బి. రామకృష్ణారావుగారు నందికొండలో మామిడిమొక్క నాటారు.

## ముందుచూపు



బహుళార్థసాధకమైన నాగార్జునసాగర్ ఆనకట్ట స్థలాన్ని డా. బి. రామకృష్ణారావుగారు పరిశీలిస్తున్నారు.

శ్రీపర్వతం మీద బౌద్ధ చైత్యంలో తన జీవితంలోని తుది భాగం గడపినట్లు వ్యక్తమవుతున్నది. ఈ శ్రీపర్వతమే నాగార్జునకొండ. ఇది కృష్ణానది కుడి ప్రక్క ఒడు పైఉన్నది.

నాగార్జునుడు గొప్ప ఇంజనీరని కూడా తెలుస్తున్నది. వరద నీరు వచ్చి గ్రామాలను పొలాలను ముంచి వేయకుండా బుద్ధగయకు సమీపమున గల ఒక నదికి ఈయన కట్టలు నిర్మించాడు. ఇటువంటి ఆధ్యాత్మిక వ్యక్తి, తాత్వికుడు, విజ్ఞాన శాస్త్రవేత్త, ఇంజనీరు కృష్ణానదీలోయలో ఇప్పటికి పదునెనిమిదేండ్ల క్రిందట తన జీవిత శేషాన్ని గడిపి ఆ ప్రాంతానికి అమరమైన ప్రతిష్ఠతెచ్చి పెట్టాడు. కనుకనే కృష్ణానదిపై నిర్మింపబడే బహుళార్థ సాధక మైన ప్రాజెక్టుకు ఆయన పేరే పెట్టబడుతున్నది.

చరిత్రను బట్టి చూస్తే నాగార్జున కొండను విజయ పురిగా వ్యవహరించేవారు. కాని ఆ విజయపురిని ౧౯౨౬ లో మాత్రమే మనం తెలిసికొన్నాము. ఇక్కడ ఒకానొక స్తూపంలో బుద్ధుని అవశేషము నిక్షిప్తం చేయబడినట్లుగా కూడా కనుగొనబడింది. ఈ అవశేషము ఆ తరువాత బుద్ధుడు మొట్టమొదటి సారిగా ఉపదేశం చేసినట్టి మూల గంధకు విహారంలో ప్రక్షిప్తంచేయబడింది. ఈ విహారం బెనారస్ దగ్గర వున్న సారనాథ్‌లో కలదు. బౌద్ధమతం నానాటికి క్షీణించి పోవడం, ఇతరమతలవారు దీనిని నిర్దాక్షిణ్యంగా రూపుమాపడం వల్లనే నాగార్జున కొండ కొంత కాలంవరకు ఊరూ పేరూ లేకుండా పోయింది. శంకరాచార్యులవారు ఈ స్థలాన్ని దర్శించారు. శిథిలమైపోయిన ఆ ప్రాచీన పట్టణ ప్రాంతం ఇప్పుడు పుష్పగిరి శంకర మఠానికి చెంది వున్నది. అచటనే స్థాపించబడిన మ్యూజియంలో అక్కడ దొరికిన శిల్పాలన్నీ భద్రపరచబడి వున్నవి.

### కృష్ణానది

కృష్ణానదికి అనేక మత సాంస్కృతిక ఉద్యమాలతో సంబంధం కలదు. ఈ నది ఒడ్డుపై మహాబలేశ్వరం మొదలు

సాగర సంగమం వరకు వివిధమతాలవారికి పవిత్రమైన దేవాలయాలనేకం వున్నవి. శ్రీ శైలం మొదలు కొని ఘంటసాల వరకు గల ప్రాంతమంతా అప్పుడు బౌద్ధమతానికి నిలయంగా వుండేది. నాగార్జునుని పేరులోని 'నాగ' అనే పదము ఇప్పుడు ఆనకట్ట కట్టబోయే స్థలానికి రెండు వైపులావున్నట్టి అనేక గ్రామాలపేర్లలో కనిపిస్తుంది. ఈ గ్రామాలలో గుంటూరు జిల్లాలోని నాగులవరం, నల్లగొండ జిల్లాలోని నాగులపాడు ముఖ్యంగా పేర్కొనదగినవి. నాగులపాడులో బౌద్ధ శిథిలాలు కూడా కలవు. ఆంధ్రుల చరిత్రలో నాగులేరు సుప్రసిద్ధమైనది. ఈ యేటి ఒడ్డుననే ఆంధ్రుల పౌరుషానికి తార్కాణగాధయైన పల్నాటి యుద్ధం జరిగింది. లాంగ్‌హర్స్ట్ అను ప్రముఖుడు వ్రాసినదానిని బట్టి పూర్వ కాలంలో కృష్ణానది చాలా పెద్దగా వుండేది. దానిపై పడవల రాక పోకలకు ఎంతో వీలుగా వుండేది. అందుచేతనే ఏడాదిలోని అన్ని ఋతువులలో పడవల ప్రయాణం సుసాధ్యమై ఈ దేవాలయాలనుంచి దిగువ కృష్ణాలోయలో వున్న గోలి, చేజెర్ల, అమరావతి, జగ్గయ్య పేట, ఘంటసాల, గుమ్మడిదూరు, బెజవాడ, భట్టిప్రోలు మొదలగు బౌద్ధక్షేత్రాలకు సులభంగా చేరుకొనుటకు వీలయ్యేది. కృష్ణానదిని గ్రీకులు మైసోలాస్ అని వ్యవహరించేవారు. అందుచేతనే వారు కృష్ణా డెల్టాను మైసోలియా అని పిలిచెడివారు. మైసోలియా సముద్ర తీరాన చాలా దూరం వరకు వ్యాపించివుండేదని ఆ ప్రాంతమంతా సిరిసంపదలలో ఓలలాడుతూవుండేదనీ, అక్కడ 'మస్లినులు' అసంఖ్యాకంగా తయారయ్యేవనీ పెరిప్లస్ అనునతడు వ్రాశాడు. దక్షిణ భారతంలోని ఈ ప్రాంతాన్ని గ్రీకులు పూర్వం ఏ పేరులో పిలిచేవారో ఆ పేరే తూర్పు



నల్లగొండజిల్లా మిర్యాలగూడెం తాలూకా త్రిపురవరం గ్రామస్తురాలు శ్రీమతి అనుముల రంగమ్మ హుజూర్‌నగర్— మిర్యాలగూడెం రోడ్డుపై ప్రయాణీకులకొరకు ఒక షెడ్డును నిర్మించింది. ఈమె అక్కడ ఒక బావికూడా త్రవ్విస్తున్నది. ప్రయాణీకుల షెడ్డుకు ముఖ్యమంత్రి డా. బి. రామకృష్ణారావుగారు ప్రారంభోత్సవం చేశారు. ఈ చిత్రంలో ముఖ్యమంత్రి, వారికి కుడి ప్రక్కన షెడ్డును నిర్మించిన దాత్రి, వారికి ఎడమప్రక్కన జిల్లా కలెక్టరు వున్నారు.



నందికొండ గ్రామం దృశ్యం

తీరంలోని రేవు అయిన మసూలీపట్నం అనే పేరులో కన్పిస్తున్నది. కృష్ణానది డెల్టాలోని ఈ ప్రాంతం నుంచే భారత దేశ వాసులు మొదటి పర్యాయంగా ఇండోనేషియాకు వలస వెళ్ళి అక్కడ నివాసమేర్పరచు కున్నారు.

కృష్ణానది అరేబియా సముద్ర తీరంలోని పశ్చిమ కనుమలలో మహాబలేశ్వరం వద్ద గల సైకత కొండపైన శ్రీ కృష్ణ విగ్రహం యొక్క నోటి నుంచి జన్మమెత్తుతున్నది. సలారావద్ద ఈ నదిలో వేణి అను ఉపనది కలుస్తుంది. అక్కడ నుంచి ఈ నది కృష్ణవేణి అనుపేరుతో వ్యవహరింపబడుతున్నది. గంగాపూరు వద్ద భీమా అను ఉపనది కృష్ణవేణిలో కలుస్తుంది. గంగాపూరులో ప్రసిద్ధమైన దత్తాత్రేయ దేవాలయం కలదు. భీమా నదికి చంద్రభాగ అని మరొక పేరుకూడా కలదు. ఈ నది ఒడ్డున విఠోభా పండరి పూరు కలదు. కృష్ణవేణి హైద్రాబాదు రాష్ట్రంలోని రాయచూరు జిల్లా గుండా ప్రహిస్తూ కళ్ళికోట మీదుగా పోతుంది. ఈ కళ్ళికోటలోనే విజయనగర సామ్రాజ్యం అంతరించడానికి కారణమైన మహాయుద్ధం ౧౫౬౫లో జరిగింది. భారత దేశంలోని పుణ్యానదులలో ఒకటైన తుంగభద్ర అనే ఉపనది సంగం వద్ద కృష్ణలో కలుస్తుంది. తుంగభద్రకూడా కొంత చరిత్రగల నది. ఈ నది తీరాన ప్రసిద్ధ దేవాలయములూ, శృంగేరి, హంపి, అనెగొంది, అలంపురం, మొదలగు క్షేత్రములు కలవు. ఆ తరువాత మలాపహారి, భావనాసి అను ఉపనదులు కృష్ణలో కలుస్తాయి. అక్కడనుంచి ఈ నది కొండలగుండా కోనలగుండా ప్రవహిస్తూ ఒకప్పుడు బౌద్ధమత కేంద్రంగా వున్నట్టి శ్రీ శైలంలో మల్లికార్జున స్వామి పాదాలు కడుగుతూ నల్లమలకొండలగుండా పోతుంది. అక్కడ ఈ నదికి ఎడమ ఒడ్డున యేలేశ్వరం, కుడి ఒడ్డున నాగార్జున కొండ వున్నవి. అది చరిత్రాత్మకమైన రేవు స్థలం. ఆసియా ఖండం యావత్తు నుంచి యాత్రికులు అక్కడ దిగేవారు. ఆరేవు శిథిలాలు ఇప్పటికీ కనిపిస్తవి. అక్కడ నుంచి ఈ నది నందికొండ గ్రామం ప్రక్కగా ప్రవహిస్తుంది. ఆ గ్రామానికి తూర్పున (౧ ౧/౨ మైళ్ళ దూరంలోనే ఇప్పుడు ఆనకట్ట నిర్మింపబడు

తున్నది. ఈ విధంగా కృష్ణానదీ బౌద్ధ బ్రాహ్మణ పుణ్య క్షేత్రాల మీదుగా ప్రవహిస్తూ బెజవాడ చేరుతుంది. ఈ బెజవాడ వద్దనే నూరేండ్ల క్రిందట సర్ ఆర్థర్ కాటన్ మహాశయుడు కృష్ణానదికి ఆనకట్ట నిర్మించాడు. ౭౭౫ మైళ్ళు ప్రవహించి, ౯౭ వేల చదరపు మైళ్ళ ప్రాంతంలో కురిసిన వర్షపునీటితో హంసలదీవి వద్ద మరొక శ్రీకృష్ణ విగ్రహం సమక్షంలో కృష్ణానది బంగాళాఖాతంలో కలుస్తుంది.

నీలం రంగునీటితో ఈనది తాను ప్రవహించేదారి పొడుగునా చరిత్రనుచూచింది. చరిత్రను నిర్మించింది. , భారత ద్వీపకల్పంలో గొప్పనది అయిన గోదావరి కేవలం మహారాష్ట్ర ఆంధ్ర ప్రాంతాలగుండా మాత్రమే ప్రవహిస్తే, కృష్ణానది ఆంధ్ర మహారాష్ట్ర కర్నాటక ప్రాంతముల గుండా ప్రవహించి ఈ మూడు సంస్కృతులకు త్రివేణియై అలరారుతున్నది.

## పరిశోధనలు

సర్ ఆర్థర్ కాటన్ కాలంలోనే కృష్ణానదిపై తగు ఆన కట్టలు కట్టే విషయాన్ని అప్పటి అవిభక్త మద్రాసు రాష్ట్రం హైద్రాబాదు రాష్ట్రం పరిశోధనలు జరిపాయి. ౧౯౦౧లో మిసర్ రీడ్ అనునాతడు ప్రాథమిక నివేదిక సమర్పించాడు. ౧౯౦౫ లో నిర్దిష్టమైన ప్రతిపాదనలు చేయబడినవి. ఆన కట్టలు కట్టడానికి అనేక స్థలాలు సూచింపబడ్డవి. కాని ౧౯౪౦ లో హైద్రాబాదు ప్రభుత్వం కృష్ణానదిపై ఒక సంయుక్త పథకానికి గల అవకాశాలను పరిశోధించింది. చివరకు నందికొండ వద్ద స్థలం నిర్ణయించబడింది. నంది కొండవద్ద డాము స్థలాన్ని, ఎడమ వైపు కాలువకు సంబం ధించిన పరిశోధనలను హైద్రాబాద ప్రభుత్వం జరిపింది. కుడివైపు కాలువ పరిశోధన పనిని ఆంధ్ర ప్రభుత్వం జరిపించింది. నందికొండ వద్ద అనువైన డాము స్థలాన్ని కనిపెట్టిన ఘనత హైద్రాబాదుదే అని అధికార రీత్యా కూడా అంగీకరింపబడింది. నందికొండ డామును ఇప్పుడు నాగార్జున సాగర్ అని వ్యవహరిస్తున్నాము. ఇది ప్రపంచలోని పెద్ద ఆన కట్టలలో ఒకటి. ఈ ఆనకట్ట నిర్మాణం వల్ల కుడివైపున ఒకప్పుడు బౌద్ధక్షేత్రమై గొప్ప విశ్వవిద్యాలయ కేంద్రమై, బ్రాహ్మణ మతస్థులైనప్పటికి బౌద్ధ మతం పట్ల సహన భావం చూపిన ఇక్ష్వాకు రాజులవంశానికి రాజధానియై వెలుగొందిన చారిత్రక స్థలం నీటిలో మునిగి పోతుంది. ఇక్ష్వాకు వంశరాణులు బౌద్ధమతాన్ని అవలంబించి చైత్యాలను విహారాలను నిర్మింపజేశారు. అట్టి రాణుల శాంతిశ్రీ పేరు చరిత్రలో కన్పిస్తున్నది.

నాగార్జున సాగర్ ఆనకట్ట స్థలం హైదరాబాదు నగరానికి ౯౦ మైళ్ళ దూరంలోను, ఆంధ్ర రాజధానియైన కర్నూలుకు ౧౭౩ మైళ్ళ దూరంలోను, మాచెర్ల రైలు స్టేషనుకు ౧౩ మైళ్ళ దూరంలోను వున్నది.

భూగర్భ స్వరూపాన్ని బట్టి, జలవిద్యుత్తు యంత్రాలకు కావలసిన స్థలాన్నిబట్టి చూస్తే ఆనకట్ట కట్టడానికి ఇప్పుడు నిశ్చయించబడిన స్థలం ఎంతో అనువుగా వున్నది. ఈ స్థలం వద్ద కృష్ణానదీ యొక్క అరగాణి ౮౩,౦౮౭ చదరపు మైళ్ళు.

డాము నిర్మాణంలో ౧,౮౮౦ అడుగుల రాతికట్ట—స్పిల్వే— వుంటుంది. డాము మొత్తం నిడివి ౧౫,౦౮౦ అడుగులు. డాము రెండు చివరల గ్రావిటీ మెసోనరీ, కంపోజైట్ డాములు, హైదరాబాదు వైపున మట్టికట్ట నిర్మించడానికి తలపెట్టబడింది. నదీగర్భం యొక్క సగటు మట్టానికి డాము ౩౬౭ అడుగుల ఎత్తున వుంటుంది.

దీని రిజర్వాయురు విస్తీర్ణం ౧౧౦ చదరపు మైళ్ళు. దీనివల్ల హైదరాబాదు వైపు, ఆంధ్రవైపు మొత్తం ౩౦ గ్రామాలు నీట మునిగి పోతాయి. ఇలా హైదరాబాద



ఈ కుటుంబంవారు నందికొండ గ్రామానికి చెందినవారు. పనులులేక ఆ మధ్య బొంబాయికి వలస వెళ్ళారు. కాని ఇప్పుడు నందికొండప్రాంతంలో పనులు బాగా దొరుకుతాయి కాబట్టి వీరు మళ్ళీ తమ గ్రామానికి వచ్చారు.



నందికొండ గ్రామప్రాంతంలో పోలీసు నాకా—కమ్యూనిస్టులు ఆ ప్రాంతంలో హింసాయుత చర్యలద్వారా భయోత్పాతాలు కలిగించినప్పుడు ప్రభుత్వం ఏవిధంగా శాంతి భద్రతలను నెలకొల్పిందో ఈ పోలీసు నాకా అక్కడి ప్రజలకు జ్ఞప్తికి తెస్తుంది.

పైపున ౨౬ గ్రామాలు మునిగి పోతాయి. వీటిలో అయిదు పెద్ద గ్రామాలు. మిగిలినవి చిన్నచిన్న గూడెములు, లంబాడీ తండాలు. పెద్ద గ్రామాలలో నందికొండ, రాయారం, పెద మునగాల, గంగరాజుపల్లి, గొడమడక మొదలగునవి కలవు.

నాగార్జున సాగర్ రిజర్వాయర్ నీటి మొత్తం పరిమాణం ౪౦౦ వేల మిలియనుల ఘనపుటడుగులు. అంటే తుంగభద్ర రిజర్వాయరు కంటె మూడు రెట్లు. నిజాం సాగర్ ప్రాజెక్టు కంటె ౧౪ రెట్లు నీరు దీనిలో వుంటుంది. నది యొక్క గరిష్ఠ వరద ప్రవాహం సెకండుకు ౧౦,౪౭,౦౦౦ ఘనపు టడుగులు. ఈ ప్రవాహం '౬౦ × ౩౦' అడుగుల పరిమాణం గల ఫ్లడ్ గేట్ల ద్వారా పోతూవుంటుంది.

## కా లు వ లు

డాముకు రెండు పైపుల ౪౯౦.౦౦ అడుగుల ఎత్తున వుండే పట్టెల గుండా కాలువలు బయలు దేరుతాయి. ఎడమ పైపు—హైదరాబాదు పైపు—కాలువ ప్రవాహం ౧౨ ౦౦౦ క్యూసెక్కులుంటుంది. ఈ కాలువ మొత్తం పొడవు ౧౪౦ మైళ్ళు. కుడిపైపు—ఆంధ్రపైపు—కాలువ వరద ప్రవాహం ౨౧,౦౦౦ క్యూసెక్కు లుంటుంది. ఈ కాలువ మొత్తం పొడవు ౨౭౬ మైళ్ళు.

ఈ ప్రాజెక్టువల్ల హైదరాబాదు పైపు ౬.౭౫ లక్షల ఎకరాల భూమి మొదటి పంట సాగు క్రిందికి, ౧.౨౦ లక్షల ఎకరాల భూమి రెండవ పంట సాగు క్రిందికి వస్తుంది. అంతే గాక హైదరాబాదు పైపున ఆంధ్ర రాష్ట్రంలోని నందిగామ తాలూకాలో ౨.౦౫ లక్షల ఎకరాల భూమి కూడా ఈ కాలువ క్రిందనే సాగు అవుతుంది. కుడి పైపున ఆంధ్ర రాష్ట్రంలోని కాలువ వల్ల ౧౪ ౭౦ లక్షల ఎకరాల భూమి సాగు అవడమేగాక పులిచింతల బ్లాకు క్రింద రెండు లక్షల ఎకరాలు, కావలిలో ౧.౧ లక్షల ఎకరాలు, కనుపూరులో ౦.౭౮ లక్షల ఎకరాలకు కూడా నీరు సరఫరా అవుతుంది.

(మిగతా ౩౮ వ పేజీలో)

# వివిధ భాషలకు, ప్రజలకు కూడలి

## హైదరాబాదు సంస్కృతికి పండిత్ పంత్ ప్రశంసలు

ఇటీవల భారత ప్రభుత్వ హోంశాఖామంత్రి పండిత గోవింద వల్లభపంత్ హైదరాబాదు నగరానికి విచ్చేసి ఇక్కడ మూడు రోజులపాటు వున్నారు. ఆ మూడు రోజులలోను వారనేక కార్యక్రమాలలో పాల్గొన్నారు. సహకార అగ్గిపెట్టెల ఫ్యాక్టరీకి వారు ప్రారంభోత్సవం చేశారు. హిమాయత్ సాగర్‌లోని వ్యవసాయ పరిశోధన కేంద్రం కాలనీకి "రాజేంద్రనగర్" అని నామకరణం చేశారు. సనత్‌నగర్ పారిశ్రామిక కాలనీకి ప్రారంభోత్సవం జరిపారు. వివిధ ప్రతినిధి వర్గాలను కలిసి



బేగంపేట విమానాశ్రయంలో హైదరాబాదు రాజప్రముఖ్ పండిత్ గోవిందవల్లభపంత్‌కు స్వాగతం చెప్పుతున్నారు.



సనత్‌నగర్ పారిశ్రామిక కాలనీకి ప్రారంభోత్సవం చేస్తూ పండిట్ పంత్ ప్రసంగిస్తున్న దృశ్యం.

ఇటీవల పండిట్ గోవిందవల్లభ్‌పంత్ ఏడు రోజుల పాటు హైద్రాబాదులో వున్నప్పుడు వారు పాల్గొన్న కార్య క్రమాలలో ఇది ఒకటి. పండిట్‌జీకి కుడిప్రక్కన హైద్రాబాదు ఆర్థిక మంత్రి శ్రీ వినాయకరావు విద్యాలంకార్ వున్నారు.



వారు చెప్పుకున్న వాటిని సావధానంగా విన్నారు. హైదరాబాద్ సికిందరాబాదు జంట నగరాలు నిజాం కళాశాల మైదానంలో ఒక బహిరంగ సభలో సంయుక్తంగా సమర్పించిన పౌర సన్మానపత్రాన్ని స్వీకరించి ఆ సభలో ప్రసంగించారు. జై జవహర్‌నగర్ హరిజన కాలనీకి శంకు స్థాపన చేశారు. సికిందరాబాదులోని జాతీయ స్వచ్ఛంద సేవక దళ శిబిరాన్ని సందర్శించారు.

నిజాం కళాశాల మైదానంలో ఏర్పాటు చేయబడిన బహిరంగ సభలో ప్రసంగిస్తూ భారతదేశంలో హైదరాబాదు రాష్ట్రానికి ఒక ప్రత్యేకస్థానం వున్నదని పండిత పంత్ అన్నారు. భారత దేశం మొత్తానికి హైదరాబాదు ప్రాతినిధ్యం కలిగి వున్నది. యదార్థంచెప్పాలంటే ఈ రాష్ట్రమే ఒక చిన్న భారతదేశం. దేశంలోని వివిధ భాషలకూ, వివిధ ప్రజలకూ ఇది కూడలిగా వున్నది. ఒక భాష మాట్లాడే ప్రజలు ప్రత్యేకంగా ఒక ప్రాంతం లోనే కుంచించుకొని పోయి తమ చుట్టూ గోడలు కట్టుకొని ఉండాలనడం శుద్ధఅవివేకం. విభిన్నమైన భాషలు మాట్లాడే ప్రజలు సమైక్యంగా కలిసి వున్నట్లయితే వారెంతో అభ్యుదయాన్ని సాధిస్తారని పండిత్ పంత్ అన్నారు.

లౌకికమైన, మత ప్రసక్తి రహితమైన రాజ్యమంటే ఒక మతంయొక్క ప్రజలు మరొక మతంయొక్క ప్రజలకంటె హెచ్చు అవకాశాలు కలిగి వుండరాదని పండిత్ పంత్ అన్నారు. అయితే మత ప్రసక్తిరహితమైన రాజ్యమంటే దేశమూ ప్రజలూ ఏ మతానికి చెందకుండా వుండాలనికూడా అర్థం కాదని వారన్నారు. ఈ దేశ ప్రజలు భగవంతుడనే వాడున్నాడని విశ్వసిస్తారు. అన్ని మతాలు వృద్ధి చెందాలని కాంక్షిస్తారు. అయితే ఈ విషయాలలో సంకుచిత మనస్తత్వం మాత్రం ప్రబలకుండా జాగ్రత్త వహించాలి. ప్రపంచంలోని వివిధ దేశాల ప్రజలను సమైక్యంచేసి సుహృద్భావాన్ని, సౌభ్రాతృత్వాన్ని పెంపొందించడానికి ప్రయత్నిస్తున్న భారతదేశం మత విచక్షణను లేదా మతపక్షపాతాన్ని పాటించరాదని శ్రీ పంత్ హితవు చెప్పారు.

పండిత పంత్ ప్రభుత్వ కుటీర పరిశ్రమల విక్రయశాలలను సందర్శించి రాష్ట్ర ప్రభుత్వం స్వదేశంలోను, విదేశాలలోను రాష్ట్రీయ చేతిపనులను వ్యాప్తిలోనికి తేవడానికి చేస్తున్న కృషిని తెలుసుకొని సంతసం వెలిబుచ్చారు.



సనత్‌నగర్ పారిశ్రామిక కాలనీ—దీనికి భారత ప్రభుత్వ హోం శాఖమంత్రి ౧౯౫౫ ఆగస్టు ౨౭తేదీన ప్రారంభోత్సవం చేశారు.

# భారతదేశ స్వాతంత్ర్యంతో మానవజాతి చరిత్రలో ఒక నూతనాధ్యాయారంభం

## ఎనిమిదేండ్లలో దేశం సాధించిన అభివృద్ధిని సమీక్షిస్తూ హైదరాబాదు ముఖ్యమంత్రి ప్రసంగం

హైదరాబాదు ముఖ్యమంత్రి డా. రామకృష్ణారావుగారు స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంలో హైదరాబాదు రేడియో నిలయంనుంచి ప్రసంగిస్తూ భారతదేశం గత ఎనిమిదేండ్లలో సాధించిన అభ్యుదయంలో ప్రపంచ పరివ్యాప్తంగా శాంతిమండలాన్ని విస్తృతంచేయడం అత్యంత ప్రధానమైన విషయమని పేర్కొన్నారు.

డా. బి. రామకృష్ణారావుగారి ప్రసంగం పూర్తిపాఠం ఇది :—

ఈనాడు మనం దేశచరిత్రలో అత్యంత ప్రధానమైన జాతీయోత్సవాన్ని జరుపుకుంటున్నాము. ఈ ఉత్సవం ఎనిమిది సంవత్సరాలక్రితం బ్రిటిషువారినుంచి మనం రాజకీయ స్వాతంత్ర్యం పొందినట్టి ఒక పర్వదినాన్ని మనకు జ్ఞప్తికి తెస్తుంది. మానవునికి కొన్ని స్వంత అభిప్రాయాలంటూ వుంటాయి. కనుక ఇటువంటి ఆనందకరమైన సంఘటనను ప్రపంచంలోని ప్రతి మానవుడు స్మరించు కొంటాడు. ఉత్సవాలు చేసుకుంటాడు. ఆనందిస్తాడు. ఫ్రెంచి విప్లవం ప్రపంచానికి నవీనమైన ప్రజాస్వామ్య భావాలను, స్వాతంత్ర్యం సమానత్వం సౌభ్రాతృత్వం మొదలగు సందేశాలను ఇచ్చింది. కనుకనే ఆ విప్లవం జ్ఞాపకార్థంగా బాస్టిల్ దినోత్సవం జరుపబడుతున్నది. అలాగే మే దినోత్సవం కార్మిక నియంతృత్వ లక్ష్యాన్ని ప్రపంచానికందజేసినట్టి రష్యా మహా విప్లవాన్ని జ్ఞప్తికి తెస్తుంది. అలాగే అమెరికా స్వాతంత్ర్య దినోత్సవంకూడా. కాని భారత స్వాతంత్ర దినోత్సవం ఇటువంటి జాతీయ పర్వదినాల వర్గంలో చేరదు. ఇది ఆదర్శంలోనూ, సాధనలోను కేవలం భారతీయమైనది. కనుక ఈ దినోత్సవం భారతీయ ఆత్మనే వ్యక్తీకరింప జేస్తుంది. ఒక మహా సామ్రాజ్యం దాదాపు రెండు శతాబ్దాలపాటు ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించి, శాంతియుత పద్ధతిలో రాజ్యాంగ విధాన సమ్మతంగా తన ప్రజలకు అధికారాన్ని దత్తం చేసిన ఒకానొక అపూర్వ సంఘటనను ఈ దినోత్సవం స్మరణకు తెస్తున్నది. భారతీయ సంప్రదాయానుసారము మహాత్మా గాంధీ ప్రవచించిన సత్యాహింసల నాధారంగా చేసుకొని జరుపబడిన ఒక మహా ఉద్యమంయొక్క ఫలితమే ఈ అధికారం మార్పిడి. ఈ పద్ధతులపై ఇంతకు పూర్వం ఏ నాయకుడూ ఉద్యమాన్ని నడుపలేదు. ఏ దేశమూ ఈ పద్ధతి ప్రకారం స్వాతంత్ర్యాన్ని పొందలేదు. గతంలో మహా యుద్ధాలు జరిగాయి. రక్తపాతం సంభవించింది. అశేషంగా జననష్టం ఆస్తినష్టం కలిగిన సంఘటనలున్నాయి. ఈ సంఘటనల విశదీకరణ వాటిలో చనిపోయిన లేదా విజయం పొందిన వ్యక్తుల గాథలే చరిత్రలుగా భాసిస్తున్నవి. కాబట్టి భారత స్వాతంత్ర్య దినోత్సవంతో మానవ చరిత్రలో ఒక కొత్త అధ్యాయం ప్రారంభమైంది. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఆసియా ఖండంలో మరికొన్ని ప్రాంతాలకు కూడా స్వాతంత్ర్యం లభించింది. మన దేశ భూభాగంలోనే ఫ్రెంచివారు తమ ప్రాంతాలను మనకప్పగించి వెళ్ళిపోయ్యారు. కనుక సత్యాహింసలు ఆచరణ సాధ్యమైన ఒక రాజకీయ తత్వంగా పరిగణింపబడుతూ వున్నవనడానికి పై సంఘటనలే నిదర్శనాలు. మానవుడు నాగరిక జీవిగా మసలవలెనంటే మరో మార్గం లేదు. భారతీయమైన ఈ తత్వం ఆటవిక సూత్రాలకు స్వస్తిచెప్పి నాగరికమైన సంప్రదాయాన్ని లోకంలో పునః ప్రతిష్ఠ చేసింది. అప్పటినుంచి అంతర్జాతీయ సంబంధాలలోను, రాజకీయాలలోను పెద్దమార్పు



౧౯౫౫ ఆగస్టు ౧౫వ తేదీన పబ్లిక్ గార్డెన్సులో జరిగిన స్వాతంత్ర్యదిన సదస్సులో కీ. శే. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు రచించిన "ఆంధ్రుల సాంఘిక చరిత్ర" కు భారతప్రభుత్వంవారిచ్చిన రూ. ౫ వేల బహుమానమును రాజప్రముఖ్ గారు శ్రీ రెడ్డిగారి సతీమణికి ఇస్తున్నారు

వచ్చింది. ఇందుకు కారణం మన ప్రధాన మంత్రియొక్క అవిరళ కృషి. మహాత్ముడు వదిలిపోయిన కార్యభారం ఆయన భుజస్కంధాలపై పడింది. ఒకప్పుడు మహాత్మాజీయే "నా తరువాత నెహ్రూ నా అభిప్రాయాలనే ప్రకటిస్తాడు" అని జోస్యం చెప్పాడు. ఆ జోస్యం ఇప్పుడు నిజమైంది. యావత్ప్రపంచంలో శాంతియుత వాతావరణాన్ని సృష్టించడానికి, శాంతి మండలాన్ని విస్తరింపజేయడానికి ఏ ఒక్క వ్యక్తి ఇంతకు పూర్వం ఇంతటి మహత్తర కృషి చేయలేదు. ఈనాడు మన పార్లమెంటులో మనం ప్రపంచ వారసత్వానికి దారితీసే ఆసియా పౌరసత్వాన్నిగూర్చి మాట్లాడుతున్నాము. ప్రపంచ మహాసభలలో గాంధీజీ ప్రవచించిపోయిన సూత్రాలు ఉద్ఘాటించ బడుతున్నవి. ప్రపంచ జనాభాలో మూడింట రెండువంతుల మంది పంచశీల సూత్రాలను అంగీకరించారు. నేని ప్రసంగం చేస్తూ వుండగా అటు జెనీవాలో ౭౩ దేశాల విజ్ఞాన శాస్త్రవేత్తలు సమావేశమై మానవుడు సృష్టించిన మహా మారణశక్తి— అణు శక్తిని శాంతికాల ప్రయోజనాలకు వినియోగించే విధానాన్ని గూర్చి చర్చలు జరుపుతున్నారు. ఆ సమావేశానికి భారతీయ విజ్ఞాన శాస్త్రవేత్త డాక్టర్ భాభా అధ్యక్షత వహించారు. మరి రెండు దశాబ్దాలలో ఒక కొత్త అణుయుగం ప్రారంభం కాగలదు అని డాక్టర్ భాభా చెప్పారు. ఆ సమావేశంలోనే అమెరికా శాంతికాల ప్రయోజనాలకు అతిరహస్యమైన తన అణుశక్తి పథకాలను వెల్లడించిందని, రష్యా కూడా తన అణుశక్తి రహస్యాలను బైట పెట్టిందని వార్తలు తెలుపుతున్నవి. వీటన్నిటిని బట్టి చూస్తే చిరకాల వాంఛగా

వున్నట్టి మానవ సామ్రాజ్యం ఆవిర్భవించే కాలం సమీపిస్తున్నట్లు గోచరిస్తున్నది. ఇందుకు అనుకూలంగా అంతర్జాతీయ వాతావరణాన్ని సృష్టించిన ఘనత భారతదేశానికే దక్కిందంటే అతిశయోక్తి కాదు. ఏ జాతి చరిత్రలోనైనా ఏడెనిమిదేండ్లు ఒక పెద్ద కాలం కాదు. ఏడు వందల ఏండ్లలో జరగవలసిన మార్పు ఈ ఏడేండ్లలో సూక్ష్మంగా వ్యక్తమైంది, కనుక ఒక్క మన దేశానికే గాక యావత్ప్రపంచానికి క్షేమకరమైన భవిష్యత్తును కొంతవరకైనా సాధించగలిగామనే సంతృప్తితో ఈనాడు మనం మన ఎనిమిదవ స్వాతంత్ర్య వార్షికోత్సవాన్ని జరుపు కుంటున్నాము.

ఏడేండ్ల క్రితం ఇదంతా ఊహాగానంగా అనిపించేది. మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరుణంలో దేశ స్వరూపం అంధకారంగా వుంది. రాజకీయంగా దేశం రెండు ముక్కలయింది. నిజం చెప్పాలంటే రెండు కాదు, మూడు ముక్కలు దేశంలో అప్పుడు మత విద్వేషాలు ప్రబలి వున్నవి. లక్షలాదిమంది ప్రజలు నిలువ నీడలేక కాందిశీకులై వచ్చారు. వాణిజ్యం ముడి సరుకుల సరఫరా స్తంభించి పోయింది. దేశంలో ఆహార ధాన్యాల పంటలు సరిగా లేవు. దేశీయుల ఆహారం కొరకై మనకున్న కొద్దిపాటి విదేశ మారక ద్రవ్యాన్ని వెచ్చించి ధాన్యం కొనుక్కోవలసి వచ్చింది. పెట్టుబళ్ళు, భూములు కొందరు మధ్యయుగపు సంప్రదాయానికి చెందిన వ్యక్తుల చేతుల్లో వుండిపొయ్యాయి. ౫౭౮ దేశీయ సంస్థానాలున్నాయి. వాటిలో మన హైదరాబాదు కూడా ఒకటి. ఇవన్నీ కొద్దో గొప్పో బెడద ప్రాంతాలుగా వుండేవి. ఈ బెడదలన్నిటికి తోడుగా జాతిపిత హత్య చేయబడ్డాడు. ఇలా జరుగుతుందని ఎవరైనా జోస్యం చెబితే అతను పిచ్చివాడని అనేవాళ్ళం. కాని ఇదే వాస్తవ పరిస్థితి. ముఖ్యంగా మన రాష్ట్రంలో ఒక వైపు మత విద్వేషంగల శక్తులు, మరొక వైపు కమ్యూనిస్టులు ప్రభుత్వంనుంచి ప్రజలను వేరు పరచడానికి ఎంతో గందరగోళం చేశారు. అంటే మనం ఒక వైపు ఎట్టి దుస్థితి నైనా ఎదుర్కోవడానికి సిద్ధంగా వుండి మరొకవైపు మంచి రోజులు వస్తాయనే ఆశతో వుండవలసి వచ్చింది. అయినా ఈ కొద్దికాలంలోనే భారతదేశం ఒకేరాజ్యంగా సుస్థిరం చేయబడింది. మత విద్వేష శక్తులు, కమ్యూనిస్టు విప్లవకారులు అణచి వేయబడ్డారు. శాంతి భద్రతలు నెలకొల్పబడినవి. సంస్థానాలన్నీ యూనియన్‌లో విలీనం చేయబడినవి. ప్రపంచ దేశాల రాజ్యాంగాలలోని ఉత్తమ అంశములను స్వీకరించి మనదేశానికి ఒక రాజ్యాంగం తయారు చేయబడింది. ఇది పూర్తిగా ప్రజాస్వామిక రాజ్యాంగం. శ్రేయోరాజ్య స్థాపన, కుల మత జాతి ప్రసక్తి లేకుండా అందరికి సమానావకాశాలు, సాంఘిక న్యాయం ఈ రాజ్యాంగం లక్ష్యాలు. దీనిని తయారు చేయడమే కష్టమైనపని. అమలు పరచడం మరింత దుర్ఘటనమైన కార్యం. దేశం మొత్తంలో ఎన్నికలు జరిగాయి. ౧౦ కోట్ల ౬౦ లక్షలమంది ఓటర్లు తమ ఓటును వినియోగించి ప్రభుత్వం నెలకొల్ప వలసిందిగా కాంగ్రెస్‌పార్టీని ఆదేశించారు. ఆ తరువాత మరొక ప్రధాన విషయం పంచవర్ష ప్రణాళిక. ఆ ప్రణాళికను సిద్ధ పరచడంగాని, అమలుపరచడం గాని సామాన్యమైన విషయం కాదు. భారత దేశంలో ఐదున్నర లక్షల గ్రామాలలో నివసించే ప్రజలలో నూటికి ౭౫ వంతులమంది యొక్క జీవన ప్రమాణ స్థాయిని హెచ్చించే ఉద్దేశంతో ప్రథమ ప్రణాళిక అమలు పరచబడింది.

శాంతియుతమైన మరొక విప్లవానికి ఇది నాంది. ఇప్పుడు మన ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలం ముగిసి రెండవ పంచవర్ష ప్రణాళిక ఆరంభం కాబోతున్నది. మన ప్రధాన మంత్రి అన్నట్లుగా "ఇంతవరకు మనం నిర్వర్తించిన కార్యక్రమాలను సమీక్షిస్తే ఒక విధమైన ఆత్మ విశ్వాసభావం మనలో కలుగు తున్నది. మన దేశానికి మన ప్రజలకూ మంచి భవిష్యత్తు వున్నట్లు ద్యోతకమవుతున్నది." ఈ విశ్వాసం తోటే మనం రెండవ ప్రణాళిక ముసాయిదా తయారుచేశాము. ఈ ప్రణాళికలో ప్రసిద్ధమైన ఆవడి తీర్మానం దృష్ట్యా సామ్య పద్ధతి సమాజాన్ని రూపొందించడానికై తలపెట్టబడింది. మన దేశంలో ఇదివరకే జాగీర్దారి జమీందారీ విధానాలు రద్దు పరచ బడ్డవి. పెద్ద మొత్తం ఆదాయాలపై పన్నురేట్లు హెచ్చించబడినవి. ఇంపీరియల్ బ్యాంకును జాతీయం చేశాం. కంపెనీల యాజమాన్యన్ని కూడా తీవ్రంగా సంస్కరించడానికి పూను కుంటున్నాము. రెండవ ప్రణాళికలో దేశంలో వున్న అసమానత్వాలను ఇంకా తగ్గించివేసి, ౧౨౦ లక్షల మంది ప్రజలకు పని పాటలు కల్పించి, మన జాతీయ ఆదాయాన్ని నూటికి ౨౫ వంతుల చొప్పున పెంచడానికి మనం పూనుకున్నాము. బ్రహ్మాండమైన బహుళార్థ సాధక ప్రాజెక్టులు ప్రభుత్వం నిర్మించే అనేక పారిశ్రామిక సంస్థలు, విస్తృతమైన గ్రామీణాభివృద్ధి పథకాలు, దేశ వ్యాప్తంగా ఆరోగ్య కార్యక్రమాలు, విద్యా సంక్షేమ పథకాలు, సామ్యవాద పద్ధతి సమాజాన్ని రూపొందించడానికై కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలు తలపెట్టిన అభ్యుదయకరమైన శాసనాలు—ఇవన్నీ మనం త్వరిత గతిని పురోగమిస్తున్నట్లు చాటుతున్నవి. మనం ఈ పురోగమనం ఆశించినదానికంటే వేగంగా వున్నట్లు

కూడా కన్పిస్తుంది. దాదాపు నాలుగైదు శతాబ్ధాలు మనం జడస్థితిలో వున్నాము. అంతే గాక తిరోగమించాము కూడా కాని ఇదే కాలంలో ఇతర దేశాలు, ముఖ్యంగా పశ్చిమ దేశాలు శరవేగంతో ముందుకు పోయాయి. ఆసియా ఖండమంతటికి కాంతిని ప్రసరింపజేసిన చైతన్యదీపం మందకొడిగా వుండి పోయింది. మన అధ్యాత్మిక స్వభావంతో బాటు భౌతిక సంపద కూడా క్షీణించింది. ఒకప్పుడు ఇతర దేశాలకు మార్గదర్శిగా వున్నట్టి మన జాతి వెనుకబడిన జాతి అయింది. అప్పుడో బాపూజీ మళ్ళీ మనలో చైతన్యం కల్గించి అన్ని విధాలా చీలి పోయిన జాతిని ఏకం చేశాడు. కనుక ఇన్ని శతాబ్ధాలనుంచి మనకేర్పడినట్టి లోటును తిరిగి భర్తీ చేయాలి. ఇతర జాతుల సరసన మళ్ళీ మనం తలెత్తుకొని నిలబడాలంటే త్వరిత గతిని పురోగమించాలి. ఇప్పుడిప్పుడే ముగియ వస్తున్న ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో మనం పొందిన అనుభవాలు, సాధించిన ఫలితాలు మనం పైలక్ష్యాన్ని చేరుకోగలమని నిరూపించాయి..

ఇప్పుడు మళ్ళీ మనకు పరిస్థితి గజిబిజీగా కన్పించవచ్చు అది సహజంకూడా. నిర్మాణంలోవున్న ఇల్లుకూడా ఇలాగే కనిపిస్తుంది. పునాదులు అసంపూర్తిగా వుండడం, నాటి చుట్టూ ఇటుక, మట్టి, రాళ్ళు పడివుండడం చూస్తే ఇల్లు ఎలా పూర్తిఅవుతుందా అని అనుభవంలేనివారు అనుకోవచ్చు. కంట్రాక్టరు డబ్బుకు కక్కుర్తిపడేవాడై, ఇటుకపనివాడు జబ్బు పడి, రాతిపనివాడు సోమరిఅయి, వడ్రంగి కిటికీలను తలు పులను చెయ్యడం ఆలస్యంచేసి, ఇనుపసామగ్రి సమయానికి దొరకక, కూలీలు మందకొడిగా పనిచేసి, మధ్య మధ్యన వర్షాలు పడుతూ పనికి ఆటంకం కలిగించి, మొదట అను కున్న అంచెనాలకు ఖర్చు రెట్టింపై, చేతిలో డబ్బులేకుండా అయితే ఇల్లు కట్టడం ఎంత కష్టసాధ్యమైనదనో ఆలోచించండి. అందుకే ఇల్లు కట్టిచూడు అన్నారు మనపెద్దలు. ఒక్క ఇల్లు కట్టడానికే ఇన్ని ఇబ్బందులైతే మరి ఒక పెద్ద దేశాన్ని పునర్నిర్మించడం ఇంకెంత కష్టం? మొదట అంతా అయో



౧౯౫౫ ఆగస్టు ౧౫వ తేదీన సికింద్రాబాదులో స్వాతంత్ర్య దినోత్సవ సభకు విద్యార్థులు ఊరేగింపుగా వెళ్ళుతున్నదృశ్యం

మయంగా వుంటుంది. శిక్షితులైన పనివారలు వుండరు. ప్రభుత్వశాఖలలో పని అంచెలమీద వచ్చేసరికి ఆలస్యం అవుతుంది. డబ్బు ఇబ్బంది వుంటుంది. లెక్కల తనఖీలో లోపాలు బైటికిరావచ్చు. వీటన్నిటి ఫలితంగా అభివృద్ధి కుంటుపడవచ్చు. ఈ ఆటంకాలను ఒక్క అంగలో అధిగమించిపోలేము. అయితే సంతోషించవలసిన విషయమేమంటే మన దేశ ప్రజలు ఈ ఆటంకాలను అధిగమించి ముందుకు పోవడానికి పూనుకున్నారు. ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఆచరణ ప్రభుత్వోద్యోగులపై పడింది. ప్రభుత్వోద్యోగి సాధారణంగా పట్నవాసియై వుంటాడు. ఆట్టే మాట్లాడడు. సందేహిస్తాడు. అయినా మన ఉద్యోగులు ఏవో కొన్ని లోపాలు తప్ప మొత్తంమీద ప్రశంసాయుతంగానే పనులను నిర్వర్తించారు. ఇక ఇప్పుడు ప్రజలు ప్రణాళికపట్ల ఆసక్తి చూపుతున్నారు. సహకారమిస్తున్నారు. ప్రణాళిక తమదేనని దానివల్ల లాభపడవచ్చునని భావిస్తున్నారు. రెండవ ప్రణాళిక పూర్తిగా ప్రజల ప్రణాళిక. అయితే దీనికి ప్రభుత్వ సహకారం వుంటుంది. ఇందులో ప్రభుత్వానికి పెద్ద జోక్యం వుండదని అనుకోకూడదు. ప్రథమ ప్రణాళిక కంటె రెండవ ప్రణాళిక చాలా పెద్దది. కనుక అధికారులపై తప్పకుండా సమధికమైన కార్యభారం పడుతుంది. మన లక్ష్యాలను సాధించాలంటే అధికారులలో నిజాయితీ, దేశభక్తి భావం చాలా అవసరం. కనుక గ్రామస్థాయినుంచి ప్రభుత్వ స్థాయివరకు అంతా శక్తికొలది కృషి చేయాలని నేను కోరుతున్నాను. పరిపాలనాయంత్రంలోని ప్రతినట్టు ప్రతిభాగం తన పనిని తాను నిర్వర్తించాలి. పదులైపోయిన భాగాలను తీసి కొత్తభాగాలను వేయడం అవసరంకావచ్చు. ఈ విషయంలో ఉన్నతాధికారులకు తగు సూచన లివ్వబడినవి. నేను, మంత్రివర్గంలోని నా సహచరులు తరచు రాష్ట్రంలో వివిధ ప్రాంతాలకు వెళ్ళి పరిపాలనా యంత్రం ఎలా పనిచేస్తున్నదో చూచి అవసరమైతే దానిని సరిచేస్తాము. మనం మన కర్తవ్యాన్ని నిర్వహించామంటే ప్రజల సహకారం విశేషంగా లభిస్తుందనడంలో నాకేమాత్రం సందేహంలేదు. ప్రజలు ఇదివరకే తగురీతిగా సహకరించారు.

దేశం మొత్తంలో జరుగుతున్న బ్రహ్మాండమైన కృషిని చూచిన తరువాత ముఖ్యంగా ఒక విషయంస్ఫురిస్తుంది. అదేమంటే ఇంతకుముస్నెన్నడూ లేనిరీతిగా కాశ్మీరునుంచి కన్యాకుమారి అగ్రమువరకు దేశమంతా ఒకేజాతిగా సంఘటిత పరచబడుతున్నది. జాతీయ భాషావ్యాప్తితో వివిధ ప్రాంతాల ప్రజలు పరస్పరం సంభాషించుకొని ఒకరినొకరు అర్థంచేసుకోగలుగుతారు. దేశం మొత్తానికి ఒక జాతీయ లిపికూడా ఏర్పడి ప్రజలు పరస్పరం సన్నిహితులు కావడానికి అవకాశమేర్పడవచ్చు. నేతాజీబోస్ అన్నట్లు దేశంలో నూటికి ౮౦ వంతుల ంది నిరక్షరాస్యులైనప్పుడు ప్రజలకు ఏ లిపి నేర్పితే మాత్రం ఏమి ?

దేశంలోని చాలా ప్రాంతాలలోను, మన రాష్ట్రంలోకూడా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘంవారి సిఫారసులు ఎలా వుంటాయో అని చాలామంది ఆసక్తి వెలిబుచ్చుతున్నారు. వారి సిఫారసులు ఎలా వున్నప్పటికి మన ఈ ప్రాచీన దేశ ఐక్యతను భగ్నం చేయమని మాత్రం ఘంటాపథంగా చెప్పగలను. ఈ దేశం అఖండమైనది. ఉత్తరప్రదేశ్, బీహార్, అస్సాం రాష్ట్రాలలో వరదలు, రాజస్థాన్‌లో అనావృష్టి మొదలగు విపత్తులు ఆ రాష్ట్రాలకేగాక యావద్భారత దేశానికి సంబంధించినవి. కనుక భారతీయుడైన ప్రతివ్యక్తి హృదయం ఆ సంఘటనలను విని కరిగిపోతుంది. ప్రతివ్యక్తి మన ప్రధానమంత్రి విజ్ఞప్తి ననుసరించి బాధితులైన ఆ ప్రజలకు సహాయపడి తీరుతాడు. ప్రజలు ఏమతానికి ఏ భాషకు చెందినవారైనప్పటికి వారి హృదయం భారతీయమైనది. ఈ లక్ష్యంతోనే మన రాష్ట్రపతి ప్రతిసంవత్సరం దక్షిణాదిలో కొంత కాలం నివసించ నిశ్చయించుకున్నారు. బొలారంలోని ఒక భవనాన్ని ఆయన 'రాష్ట్రపతి నిలయం'గా ఎంచుకున్నారు. ఇది మనరాష్ట్ర ప్రజలకు, ఇచ్చటి వాతావరణానికి ఒక విధమైన ప్రశంస. నిన్ననే రాష్ట్రపతి నిలయమని నామకరణముచేయబడిన బొలారం రెసిడెన్సి సలాంఛనంగా రాష్ట్రపతికి అప్పగించబడింది. ఆయన స్వాతంత్ర్యదినోత్సవాన్ని మన పొరుగునవున్న ఆంధ్ర రాష్ట్రంలో గడుపుతున్నారు.

ఇది ఒక గొప్పరోజు. ఈనాడు మనం దేశ స్వాతంత్ర్యం కోసం బాధలుపడి అసువులర్పించిన దేశభక్తులకు శ్రద్ధాంజలి సమర్పిస్తాము. బ్రిటిషు పోలీసువారి లాటీల నెదుర్కొన్న స్వచ్ఛంద సేవకుడు మొదలుకొని ఒకానొక మూర్ఖుని తుపాకి గుండుకు బలియైన జాతిపితవరకు అందరిని ఈనాడు మనం స్మరిస్తాము. బాపూజీని హత్యచేశారు గాని ఆయన ఆత్మనెవ్వరూ, ఏ శక్తి చంపలేదు. మానవజాతి మేలుకొరకే ఆ ఆత్మ అనిత్యమైన శరీరాన్ని వదిలిపోయింది. ఈనాడు మనం జాతిపితకు జోహార్లర్పిస్తూ ఆయన ప్రవచించిన సత్యాహింసల మార్గాననే దేశసేవకు మరొకమారు దీక్షగైకొందాము.

# చరిత్ర ప్రసిద్ధమైన ఆంధ్రనగరం వరంగలు

రచన :–డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

ప్రాచీనాంధ్ర నగరములలో ఓరుగల్లు పేరెన్నికగన్నది. ఓరుకల్లు అంటే ఒక రాయి. వరంగల్లు అనే పదం దీని అపభ్రంశం. దీనికి ఓరుకల్లు అనుపేరు. బహుశా కోట మధ్యభాగంలో వున్న పెద్ద రాతిబండనుబట్టి వచ్చివుండవచ్చు. మధ్యయుగంలో వరంగలు పట్టణం చాలా పెద్దది. అప్పుడు దీనిలో అనుమకొండ, మట్టెవాడ, ఇంకా చుట్టుపక్కల వున్న కొన్ని గ్రామాలు కలిసి వుండేవి. మధ్యయుగపు దక్కన్ రాజవంశాలలో సమున్నత స్థానంగల కాకతీయరాజులకిది రాజధానినగరం.

## వేయిస్తంభాల దేవాలయం

కాజీపేట రైలు జంక్షనుకు నాలుగు మైళ్ళదూరంలో వున్న హానుమకొండలో కాకతీయులు నిర్మించిన ఈ సుప్రసిద్ధ దేవాలయం వుంది. రుద్రదేవమహారాజు దీనిని క్రీ. శ. ౧౧౬౩ లో నిర్మించాడు.

ఈ దేవాలయం తూర్పు ముఖద్వారాన ఒక పెద్ద నల్ల రాతిపలక వున్నది. దానిపై తెలుగులిపితో సంస్కృత భాషలో ఒక శాసనం రాయ బడివున్నది. ఈ శాసనం దేవాలయ నిర్మింపబడిన తేదీని, దేవాలయ నిర్మాత యైన కాకతీయ రుద్రదేవరాజు వంశావళిని అప్పటి వరంగల్లు పట్టణపు వర్ణనను, ఇంకా మరికొన్ని చారిత్రక వివరాలను తెలుపుతున్నది.

దేవాలయానికి, మంటపానికి మధ్యవున్న బహిరంగ స్థలంలో పెద్ద నల్లరాతి నంది వున్నది. ఇది ఉత్తమమైన శిల్పం. అయితే వరంగల్లుకు దాదాపు నలభై మైళ్ళ దూరంలో గల రామప్ప గుడిలోనినందికంటె ఈ నంది శిల్పంలోను, రీతిలోను అల్పమైనదనే చెప్పాలి.

వెయ్యి స్తంభాల గుడి నక్షత్రాకారంలో మూడు ఆలయాలతో నిర్మింపబడింది. ఈ మూడు ఆలయాలు రుద్రేశ్వర, వాసుదేవర, సూర్యదేవరలవి. ఈ ఆలయాలలో ఇప్పుడు దేవతా మూర్తులు లేవు. కాని ఆలయద్వారలపై చెక్కబడివున్న శిల్పం అతిసుందరమైనది.

ఈ ఆలయంలో దాదాపు 300 స్తంభాలున్నవి. వీటి అమరిక, వీటి మధ్య విడువబడిన ఖాళీ స్థలం దేవాలయ నిర్మాణ పథకానికి తగినట్లుగా చూడముచ్చటగా వున్నది. మంటప స్తంభములు ఎట్టి శిల్పాలు లేక చదునుగా వున్నవి. దేవాలయ స్తంభములపై రమణీయమైన శిల్పాలు చెక్కబడి వున్నవి. ఒక్కొక్క జంట స్తంభాల డిజైను ఒకే తీరుగా వుంటుంది. దేవాలయ శిల్పమంతా—ముఖ్యంగా విశ్రాంతి స్థలాల ద్వారాలు కిటికీలు ఉపయోగించబడిన శిల్పఫలకాలు స్థంభాలకమర్చబడిన చత్రాలు కడు సుందరంగా వున్నవి. మూడు ఆలయాలను కలుపుతూచేసిన అమరిక సాధారణ నిర్మాణాని కంటె ఎక్కువ వెలుగునీడలను ప్రసరింపచేస్తున్నది దీనికి తోడు దాదాపు మూడు అడుగులఎత్తు, ౧౦ నుంచి ౧౫ అడుగుల వెడల్పుగల ఉన్నత స్థలం పై కట్టడం వల్ల ఈ దేవాలయం చూడడానికెంతో బాగా వుంటుంది.

## వరంగల్లు కోట

వరంగల్లు కోటను కాకతీయ గణపతి దేవుడు, అయన కుమార్తె రుద్రమదేవి ౧౩వ శతాబ్దంలో నిర్మించారు. రుద్రమదేవి పట్టణం చుట్టు ప్రాకారాలను కూడానిర్మించింది. వీటి బైటిగోడల చుట్టు కొలత ౭ మైళ్ళు, లోపలిగోడల చుట్టు కొలత నాలుగుమైళ్ళు.

## తోరణద్వారాలు.

కోటలోపల నాలుగు ద్వారాలున్నవి. ఇవి సాంచీద్వారాలన్ను స్ఫురింపజేస్తాయి. ౪౮౦ అడుగుల పొడుపు ౪33 అడుగుల వెడల్పుగల అచటి విశాలమైన స్థలంలోని పెద్ద దేవాలయానికి ద్వారాలుగా ఇవి మొదట ఉద్దేశింపబడ్డవి. స్థానికంగా ఈ ద్వారాలను కీర్తి స్తంభాలంటారు. ఇవి ఒకే నమూనాలో వున్నాయి. కమానుల రాయి నల్లరాయి. ఈ రాయి పై

మంచి శిల్పాలు చెక్కబడివున్నవి. మధ్య మధ్య బొమ్మలు ఇతర చిహ్నాలు తీర్చి దిద్ద బడివున్నవి. కమానులకు అంచు లందు హంసలు చెక్క బడినవి. ఇవిచూచుటకెంతో అందంగావున్నవి.

ఈ ద్వారాల మధ్యస్థలంలో కొంత కాలం క్రిందట జరుప బడిన త్రవ్వకాలవల్ల ఒక పెద్ద దేవాలయం యొక్క శిథిలాలు బైటపడినవి. ఈ దేవాలయనిర్మాణ విధానం చాళుక్య శిల్పాన్ని పోలివున్నది.

## శిల్పవిన్నాణం

వరంగల్లు శిల్పకళాలక్ష్మికి ఒక ఆంగ్ల కళా కారిణి ఈ విధంగా జోహార్లు అర్పించింది. "రేకులు, ముత్యాల సరాలు, సన్నటి గుబ్బలు మొదలైన వాటి తీరులు, అంచులుచెక్కడాలు అతి సూక్ష్మమైన పనివాడితనాన్ని వ్యక్తం చేస్తాయి. ఏనుగుల శిఖరాలపై ఒక దాని తలపై మరొకటి దూకుతున్నట్లుగా కన్పించే భయంకరమైన నాగసర్పములు ఎంతో చక్కగా చిత్రింపబడినవి. దుర్గప్రతిమ కడు రమణీయంగా వున్నది. ఈమెకు ఎనిమిది చేతులున్నాయి. ప్రతిపైపు నలుగురు సేవిక లున్నారు. ఈ స్త్రీల ఆకారములు ఆకర్షణీయంగా వున్నవి. ముక్కోణాకార ఫలకంపై చెక్కబడివున్న ఒక సర్పము యొక్క ఛాయా చిత్రాన్ని నేను తీశాను. ఇది పుష్పాకృతిలోవుంది. సామాన్యంగా అన్ని దేవాలయాలపై ఇటువంటి శిల్పమే కన్పిస్తుంది. హనుమకొండ దేవాలయంలోని లోతట్టు కప్పుపై కూడా ఇటువంటివే ఉన్నాయి. మరొక చట్టంపై ఇద్దరు స్త్రీలు కన్పిస్తారు. వీరు నర్తకుల దుస్తులలో కడు నాజూకుగా కన్పిస్తారు. వీరి కిరుప్రక్కల ఒక హంస పై ఒక నెమిలి నాట్యమాడుతూ వుంటుంది. చెట్లు గుర్రాలు—రౌతు, ఇంత సజీవంగా చెక్కబడినట్టి శిల్పంనేనెక్కడా చూడలేదు. ఆ మధ్య స్ఫటిక లింగమొకటి కనుకొనబడింది. ఇది ఏమాత్రం చెడకుండా వున్నది. ఇక్కడ ఎన్నో విధాలైన నిషేపాలున్నాయి."

## చరిత్ర

కాకతీయ వంశప్రారంభ చరిత్ర ఇంకా తెలియదు. కాకతి అనే దేవతను ఈ రాజులు పూజించేవారని, కాబట్టే వీరు కాకతీయరాజులనబడినారని కొందరంటారు. మరి కొందరు కాకతి అనే పేరుతో ఒక పట్టణం ఉండేదన్నీ, అందుచేతనే వారికి కాకతీయ రాజులనే పేరువచ్చిందని అంటారు.

కొంత కాలం తరువాత బయల్పడిన శాసనాలలో మొదటి ముగ్గురు కాకతీయ రాజుల పేర్లు కన్పిస్తాయి. కాని ఇవి వట్టి పేర్లుమాత్రమే, వారి వివరాలు మనకేమీ తెలియవు. రెండవ ప్రోలరాజు కాలంలో కాకతీయ పరిపాలన ప్రారంభమైనదని చెప్పవచ్చును. ఇతడు కళ్యాణి పశ్చిమ చాళుక్యవంశానికి చెందిన మూడవ తైలునిపై దండయాత్రచేసి అతనిని ఓడించి పట్టుకున్నాడు. కాని తరువాత అతనిని ఆదరాభిమానాలతో విడిచిపెసినట్లు హనుమ కొండలోని శాసనం వల్ల తెలుస్తున్నది. ప్రోలరాజుయొక్క రాజ్యం మొదట వరంగల్లు పట్టణం, దాని పరిసరాలవరకే పరిమితమై వుండేది. కాని అతడు త్వరలోనే నేటి హైదరాబాదు రాష్ట్రంలోని ఇప్పటి తెలంగాణా ప్రాంతము నంతటినీ జయించి బలీయమైన స్వతంత్ర రాజ్యానికి పునాదివేశాడు. రెండవ ప్రోలరాజు కుమారుడు రుద్రుడు క్రీ.శ. ౧౧౫౯ నుండి ౧౧౯౫ వరకు పరిపాలనచేశాడు. ఇతడు ఆంధ్రదేశంలోని తూర్పు జిల్లాల కోస్తా ప్రాంతం వరకు జయించాడు. ఇతని కాలంలో శ్రీశైలదేవాలయ ప్రాంతం కాకతీయ సామ్రాజ్యానికి దక్షిణ సరిహద్దు అయింది.

అప్పుడు ఉత్తరాన, పశ్చిమాన, యాదవులు పరిపాలిస్తూ వుండినారు. వారుమొదట చాళుక్య రాజులకు సామంతులు. కాని తరువాత స్వతంత్రులైనారు. అందుచేత కాకతీయుల రాజ్యం ఆదిక్కులకు విస్తరించలేక పోయింది. ఈశాన్య భాగంలో కళింగ రాజ్యం, ఇంకా ఇతర ప్రాంతాలు బలీయమైన పరిపాలకుల క్రింద లేకపోయి నప్పటికీ కాకతీయులు ఆవైపుకు తమ సామ్రాజ్యాన్ని విస్తరింపజేయడానికి ఎన్నడూ గట్టిగా ప్రయత్నించలేదు.

రుద్రుని తరువాత మహాదేవుడు రాజ్యానికి వచ్చాడు. ఇతడు నాలుగేండ్లు మాత్రమే పరిపాలన చేశాడు. ఇతడు మరణించిన తరువాత (ఇతడు బహుశా యాదవులతో జరిగిన యుద్ధంలో మరణించి వుండవచ్చును.) గణపతి దేవుడు రాజ్యానికి వచ్చాడు. కాకతీయ వంశరాజులలో ఇతడు మిగుల గొప్పవాడు. ఇతని కాలంలో కాకతీయుల రాజ్యం మద్రాసు రాష్ట్రంలో చెంగల్పట్టు జిల్లాలోని కంచి వరకు వ్యాపించింది. మద్రాసు రాష్ట్రంలో తిరుచిరాపల్లి జిల్లాలోని జంబై వరకు ఇతడు దండయాత్రగావించాడు. ఇతని కాలంలో దక్షిణ భారతం చిన్న చిన్న రాజ్యాలుగా ముక్కచెక్కలైవుంది.

విక్రమసింహపురం లేక నెల్లూరు అను చిన్న రాజ్యములోని ఒకానొక కుటుంబ కలహం ఇతడు ఆ ప్రాంత వ్యవహారాలలో జోక్యం కల్గించుకోవడానికి మంచి అవకాశాన్ని లభింపజేసింది.

గణపతిదేవుని తరువాత ఆయన కుమార్తె యైన రుద్రమదేవి రాజ్యానికి వచ్చినది. ఈమె చిన్న తనం నుంచి బాలిక

(మిగతా ౩౮ పేజీలో)

# శ్రేయో రాజ్యంలో ప్రభుత్వోద్యోగి పాత్ర

## రాజకీయ వర్గాల జోక్యంలేకుండా ఉద్యోగులకు స్వేచ్ఛ ఉండడం అవసరం


### శ్రీ డి. జి. బిందూ


హైదరాబాదు ప్రభుత్వ హోంశాఖామంత్రి శ్రీ డి. జి. బిందూ ఈ వ్యాసంలో స్వతంత్ర భారతదేశంలో ప్రభుత్వోద్యోగులు నిర్వహించిన ప్రముఖ పాత్రను ఉగ్గడిస్తూ, ఉద్యోగులు తమ కర్తవ్యాన్ని ఎట్టి జోక్యం లేకుండా నిర్వహించాలంటే రాజకీయ పక్షాలవారు వారికి స్వేచ్ఛ ఇవ్వాలని కోరారు.

బ్రిటిషువారు మనదేశాన్ని పరిపాలిస్తూ వున్న రోజులలో నాకు ఒక యూరోపియన్ కలెక్టరు స్నేహితుడుగా వుండేవాడు. ఆయన మద్రాసు రాష్ట్రంలో ఒక జిల్లాకు కలెక్టరగా పనిచేస్తూ వుండేవాడు. ఐ. సి. యస్. ఉద్యోగి అయినప్పటికీ ఆయనకు మహాత్మాగాంధీ అంటే మిక్కిలి ఆదరాభిమానాలుండేవి. భారత దేశానికి ఆయన నిజమైన మిత్రుడని ఇప్పటికీ నేను అనుకుంటాను. ఒక పర్యాయం ఆయనకు రాయల్ కమీషన్‌లో కార్యదర్శి పదవిని ఇవ్వజూపారు. అది చాలా ముఖ్యమైన పదవి. కాని దానిని స్వీకరించడానికి ఆయన ఒప్పుకోలేదు. ఈ విషయం ఆయన నాకు ఒకమారు స్వయంగా చెప్పాడు. అంతమంచి పదవిని ఎందుకు స్వీకరించలేదని నేనాయన్ను ప్రశ్నిస్తే ఆయన చెప్పిన సమాధానం ఇది. "చేస్తే నేను జిల్లా కలెక్టరుపనైనా చేస్తాను. లేదా గవర్నర్ జనరల్ పదవి అయినా స్వీకరిస్తాను. అంతేకాని ఈ మధ్య రకం పదవులు నాకక్కరలేదు. అసలు ఈ పదవులలో వుండి చేసేదేమీ వుండదు. ప్రజలకేమైనా మేలు చేయాలని నా ఆకాంక్ష." చివరకు ఆయన అభీష్టం ప్రకారమే జరిగింది. జిల్లా కలెక్టరుగానే ఆయన పదవి విరమణచేశాడు.

ఈ విషయాన్ని నేను రెండు కారణాలతో చెప్పాను. ఒకటి ఈ ఉదంతాన్ని బట్టి ప్రభుత్వోద్యోగి యొక్క వైఖరి ఎంత ముఖ్యమైనదో తెలుస్తుంది. రెండవదేమంటే జిల్లా అధిపతికి ఎంత ప్రాముఖ్యమున్నది దీనివల్ల విదితమవుతుంది. బ్రిటిషు వారి పరిపాలనలో కూడా స్వతంత్ర భావాలు కలిగి ప్రజలకు సేవచేసే ఉత్సాహంగల ఉద్యోగులు వుండేవారు. అటువంటి ఉద్యోగులే లేకపోయినట్లయితే విదేశీ పరిపాలన మరి దుర్భరమై పోయి అది త్వరగా అంతరించవలసిన పరిస్థితులొచ్చేవి.

బ్రిటిషు వారి హయాంలో ప్రభుత్వోద్యోగి తన సాధారణ విధులు నిర్వర్తించడం తప్ప మరేమీ చేయవీలులేదు. అసలు రాజ్యమే పోలీసు రాజ్యంగా వుండేది. ఇక పరిపాలన రెవిన్యూ పరిపాలన—శాంతి భద్రతలను పరిరక్షించడం, భూమి శిస్తు వసూలు చేయడం ఇవే ప్రభుత్వోద్యోగుల ముఖ్య కర్తవ్యాలు, అందుచేతనే జిల్లా అధిపతిని "కలెక్టరు మరియు జిల్లా మెజిస్ట్రేట్' అని వ్యవహరించేవారు. ఇక రాష్ట్రానికంతటికి ముఖ్యాధికారి ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి. ఆయనకు సహాయకులుగా అనేక కార్యదర్శులుండేవారు. వీరంతా రాజధాని నగరంలో వుండేవారు. పరిపాలన వారి చేతుల మీదుగా జరిగిపోయ్యేది. ప్రజలతో చాలా అరుదుగా వారికి సంబంధముండేది. అసలు సంబంధాలుండవలెనని కూడా లేదు. ప్రభుత్వోద్యోగి స్వతంత్రంగా ఆలోచించడం ప్రమాదకరమని అనేవారు. అతను తనకైతాను దేనికి పూనుకోకూడదు. నిబంధనల ననుసరించి పరిపాలనను నిర్వహించడం, వ్యక్తికి ప్రతిగా ప్రభుత్వ శ్రేయస్సును సంరక్షించేందుకై చట్టాలకు వ్యాఖ్యచెప్పడం అతనికర్తవ్యం. ప్రభుత్వానికే అతను ప్రాధాన్యమిచ్చేవాడు, గాని ప్రజలకు కాదు. ఒక ఉద్యోగి ఆర్థిక శాఖాధిపతి అయితే కొత్తగా ప్రతిపాదించిన ఖర్చులను వేటినైనా ఏదో ఒక నియమం క్రింద త్రోసివేయడమే అతని పని. కొత్త పనులేమీ జరుగకుండా చట్టాలను వ్యాఖ్య చేసేవారు. అంటే అంతా ప్రతికూలవైఖరి. ఒక ప్రభుత్వ శాఖ నుంచి మరొక శాఖకు కాగితం పోయిందంటే ఎన్నో అంచెలమీదుగా అదిపోవలసి వుండేది. మొదట గుమాస్తా ఆ కాగితాన్ని వ్రాసి దాఖలుచేస్తాడు. అతనిపైన వున్న అసిస్టెంటు ఆ కాగితాన్ని పరిశీలించి నియమాలకూ, ఇదివరకు జరిగిన ఉదాహరణల కనుగుణంగా ఒక నోటువ్రాసి సూపరింటెండెంటుకు పంపేవాడు. ఆయన ఆ నోటును చూచి

డిప్యూటీ సెక్రటరీకి పంపేవాడు. ఆ డిప్యూటీ తన క్రింది ఉద్యోగుల అభిప్రాయాలలో ఏకీభవించి దానిపై సంతకం పెట్టేవాడు. ఆ తరువాత ఆ కాగితం సెక్రటరీకి పోయేది. ఆయన సంతకం పెట్టేసేవాడు. అంటే ప్రత్యక్షంగా జరిగేదేమంటే అసిస్టెంటు అభిప్రాయమే చివరకు నెగ్గేది. అప్పుడు కాగితాన్ని దానికి సంబంధించిన శాఖకు పంపి అక్కడ కూడా ఆ కాగితం ఇదే మాదిరిగా పై మెట్టుకు క్రింది మెట్టుకు పోయేది. ఒక వేళ అక్కడ ఏమైనా అనుమానాలు పుట్టుకొస్తే ఆ కాగితానికి వివరణ అడిగేవారు. ఆ కేసు ఒక వేళ శిక్షార్హుడైన ఉద్యోగి యొక్క పింఛనుకు సంబంధించినదైతే ఆ కాగితంపై ఉత్తర్వులొచ్చే సరికి బహుశా ఆ ఉద్యోగి ఫలితమేమయిందో తెలుసుకోకుండానే కాలధర్మం చేసివుంటాడు. ఆ నియమాన్ని చేసింది మనిషేననీ, అది మనిషి కొరకేననే భావం ఎక్కడా అగుపడేదికాదు. అటువంటప్పుడు మనుషుల సౌకర్యం కొరకు దాన్ని మార్చడమనే ప్రసక్తి ఎలావస్తుంది? ఇలా పరిస్థితులు ఎక్కడున్నవి అక్కడే గొంగళి అంటే వేసినచోటే వున్నానన్నట్టుగా వుండేవి.

బ్రిటిషు వారినుండి మనకు సంక్రమించిన అధికారులు, ఉద్యోగులు ఇటువంటి సంప్రదాయంకలవారు. అట్టివారితోనే మనం స్వతంత్ర భారత పరిపాలనను నిర్వహించ వలసి వచ్చింది. అందుచేతనే జాతీయవాది అయిన వ్యక్తి ఈ ఉద్యోగులపట్ల, వారి వైఖరి పట్ల నిరసన భావం కలిగివుండేవాడు. మనం పురోగమించాలంటే ఈ ఉక్కు చట్రం ఉద్యోగులను పూర్తిగా తీసివేయాలసిందని మనలో కొందరు నాయకులు భావించారు. విదేశీ ఉద్యోగులు ఎలాగూ వెళ్ళిపోతారు. కాని మన ఉద్యోగుల సంగతేమిటి? వాళ్ళను తీసేస్తే మరి బదులుగా ఎవరిని నియమించడం? కాబట్టి ఇది కుదరని సంగతి. ఎలాగైనా వాళ్ళతోనే మనం నెట్టుకు రావలసి వచ్చింది.



శ్రేయోరాజ్యంలో సమస్త కృషి, సకల సంపదలు ప్రజా సంక్షేమం కొరకే వినియోగింపబడుతాయి. ఈ ఆదర్శం ప్రభుత్వోద్యోగులకు కూడా ప్రేరణ కల్గిస్తుంది. ఈ చిత్రంలో నల్లగొండ జిల్లాలో నిర్మింపబడుతున్న మూసీ ప్రాజెక్టు స్థలాన్ని చూడవచ్చు

ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వ కార్యాలయంలో స్వతంత్రం వచ్చిన మొదటి రోజుల్లో ఒక ప్రజామంత్రి కార్యాలయంలోని తన గదికి వెళ్ళి కూర్చొని చుట్టూ పరకాయించి చూస్తే ఒక చేపు కట్టలకొద్దీ ఫైళ్ళు పడివున్నాయట. ఆయన ఒక పెద్ద కట్టతీసుకొని చూడడం మొదలు పెట్టాడట. రెండు గంటలు చూచినా ఆయనకు తలాతోకా తెలువలేదుట. అసలే ఒడుున ఫైళ్ళు చూడడం కొత్త. అందులో ఈ కట్టలు. వెంటనే ఆయన కార్యదర్శిని పిలిపించి వీటన్నిటిని ఏమి చెయ్యాలని అడిగాడట. ఆయనగారు సమాధాన మిస్తూ వాటిని తన డిప్యూటీ సెక్రటరీ చూస్తూ వుంటాడని, "ఏ" సెక్షన్ అంతా డిప్యూటీ సెక్రటరీ క్రిందనే వుంటుందని తాను వెళ్ళి ఆయనను పంపిస్తాననీ అన్నాడట. తరువాత డిప్యూటీ సెక్రటరీ వచ్చి వాటి సంగతి తన అసిస్టెంటు సెక్రటరీకి బాగా తెలుసునన్నాడు. అసిస్టెంట్ సెక్రటరీ వచ్చి ఆ సెక్షన్ సూపరింటెండెంటును పిలిపించాడట. సూప రింటెండెంట్ తో అతని అసిస్టెంట్ కూడా వచ్చాడు. అతను అయిదు నిమిషాలలో సంగతంతా వివరించి చెప్పాడు. ఆసిస్టెంటు ఈ పనిచేయగలిగితే మిగతా అధికారులతో తనకవసరం లేదని ఆ మంత్రిగారన్నారట. ఆ మాదిరి అసిస్టెంట్లుగా మరి కొందరు తనకున్నట్లయి తే పని అంతా తాను నడప గలనని మంత్రిగారు చెప్పారు. ఇదంతా ఒక కథలాగా చెప్తు కున్నారు అమాత్య అంటే ప్రజాప్రభుత్వం ఏర్పడ్డప్పుడు పరిస్థితి ఎలావుండేదో దీనిని బట్టి తెలుస్తుంది. అందుచేతనే జాతీయ పరిపాలన విషయమై అది సరిగా నడుస్తుందా లేదా అని చాలామందికి సందేహాలు కలిగాయి. ఎనిమిది సంవత్సరాలు గడిచాయి. కాని పరిపాలన పతనం కాలేదు. చక్కగా నడుస్తూ వుంది. విదేశాంగ కార్యాలయంలో బ్రిటిషువారి హయాంలో జాతీయోద్యమాన్ని గూర్చి దుష్ప్రచారం చేసిన ఉద్యోగి అలాగే ఇప్పటికీ వున్నాడు. జాతీయనాయకులను అరెస్టుచేయవలసిందని హోం శాఖకార్యాలయం నుంచి ఉత్త ర్వులు జారీచేసిన ఉద్యోగి కూడా అలాగే వున్నాడు. ఇంకా మంచి పదవిలోనే వున్నాడు. సత్యాగ్రహులపై లాటీచార్జి చేసిన పోలీసు ఉద్యోగి అలాగేవున్నాడు. అయినా పరిపాలన పడిపోలేదు. ఎందుకని? ఎందుకంటే ఉద్యోగి ప్రభుత్వ ఉత్తర్వులను పాటించి, తన ప్రభుత్వ విధానాన్ని వివ రిస్తూ దానిని అమలు పరుస్తూవుంటాడు. ప్రభుత్వం మారితే అతనూ మారిపోతాడు, శాశ్వత సివిల్ సర్వీసు సంగతే అంత, వాళ్ళకు ఒక విధానం ఉండదు. సివిల్ ఉద్యోగి ఒక దర్జీవంటివాడు. మీరు ఎలా కుట్టమంటే అ దర్జీ అలా కుడతాడు. వెనుక అతను సూట్లు కుట్టేవాడు. ఇప్పుడు షేర్వానీలు, కాలర్ కోట్లు కుడుతున్నాడు. అయితే దర్జీలలోమంచి వాళ్ళు వున్నారు. చెడ్డవాళ్ళూ వున్నారు బ్రిటిషు వారి సంప్రదాయంలో సివిల్ ఉద్యోగి ఎలా వ్యవ హరించి వున్నప్పటికి అతనిలో కొన్ని మంచి అంశాలున్నవి. ఈ విషయం మనకు స్వాతంత్ర్యం వచ్చిన మొదటి రోజుల్లో నిరూపింపబడింది. ఒక పర్యాయం పార్లమెంటులో ఒక కాంగ్రెసు సభ్యుడు ప్రభుత్వాధికారులను తీవ్రంగా విమర్శిస్తే కీ. శే. సర్దారు పటేల్ వాళ్ళను బలపరస్తూ "వాళ్ళు వాళ్ళ ఎత్తు బంగారం విలువచేస్తారు" అన్నాడు. అధికారి బల్లముందు కూర్చుంటాడు. ప్రజల విమర్శలకు జవాబు చెప్పుకొనే అవకాశం అతనికి లేదు, ప్రజలు కేవలం తమ ఇష్టా యిష్టాలు ఆధారంగా స్వాతంత్ర్యం వచ్చిన రోజుల్లో, ఇష్టమొచ్చినట్లుగా విమర్శిస్తూ వుంటే అధికార్లను ఆవిమర్శల నుంచి కాపాడడానికి ప్రత్యేక చర్యలు గైకొనవలసి వచ్చింది. ప్రజల్ని నోరులేని అమాయకులని అంటాము. కాని అధికారికి కూడా నోరు లేదు.

నేనిలా అంటున్నానంటే కేవలం పరిపాలనా వ్యవస్థను ప్రశం సించే ఉద్దేశంతో కాదు. దాని లోపాలు దానికున్నవి. ఉద్యోగులలోనూ లోపాలున్నవి. పాత ఫైళ్ళ ఇంకా వుండ వచ్చు. ఫైళ్ళ బీరువాలు అలాగే వున్నవి. కార్యనిర్వహణలో అంచెలపద్ధతి, జాప్యం అలాగేవున్నవి. అయితే కొంతమంచి మార్పు కూడా వచ్చింది.

ప్రభుత్వానికి ముఖ్యాంగాలు ఇవి:— ౧. శాసన సభ ౨. కార్య నిర్వాహకాధికారులు. ౩. న్యాయస్థానాలు రాజ్యాంగాన్ని అనుసరించి ప్రజలమేలు కొరకై శాసన సభలో శాసనాలు చేయబడుతాయి. శాసన సభ తీర్మానాలను కార్య నిర్వాహకాధికారులు అమలుపరుస్తారు. న్యాయస్థానాలు— వీటిలో కూడా ప్రభుత్వోద్యోగులే వుంటారు—శాసనాన్ని నిర్వచించి ప్రభుత్వానికీ వ్యక్తికీ మధ్య ఏర్పడే వివాదాలలో న్యాయ సూత్రాలనుసరించి తీర్పులు చెబుతాయి

రాజ్యాంగంలో నిర్దేశించబడినట్టి సమాజాన్ని సృష్టించ డానికి అనుకూలమైన శాసనాలను కేంద్రంలో, రాష్ట్రాలలో వున్నట్టి శాసన సభలు చేస్తూ వుంటాయి. మన రాజ్యాంగం లో నిర్దేశించబడిన సమాజం ఎట్టిది? అది శ్రేయోరాజ్యం. వ్యక్తుల ఆదాయాలలో అధికమైన అసమానత్వాలుండనట్టి



మూసీనది ప్రాజెక్టు నిర్మాణం దాదాపు పూర్తి కావస్తున్నది. ఈ దృశ్యంలో పని జరుగుతున్న వైనాన్ని చూడవచ్చు.

రాజ్యం. కులమత జాతి లింగ విచక్షణలతో నిమిత్తంలేకుండా అందరికీ సమానావకాశాలుండే రాజ్యం.

ఆవడిలో సమావేశమైన భారత జాతీయ కాంగ్రెసు సామ్యవాద పద్ధతి సమాజమే మన లక్ష్యమని తీర్మానించింది. అప్పుడు చాలా మందికి ఈ మాట అస్పష్టంగా వున్నట్లనిపించింది. ఇదేదో కొత్త మాటా? లేక మనం ఇంతవరకు చేస్తూ వచ్చిన కృషికి అంతిమ ఫలితమా? సామాన్య మానవుని మేలు, మిశ్రమ ఆర్థిక వ్యవస్థ--ఇవి సోషలిజమూ కావు, పెట్టుబడి దారీ విధానమూ కావు. కాని 'సామ్యవాద పద్ధతి' అనే మాట పెట్టుబడిదారీ విధానం నుంచి మనల్ని మరి కొంత ముందుకు తీసుకు పోయి సోషలిజానికి దగ్గరగా చేరుస్తుంది. ఆ మాట కొస్తే సోషలిజం అనే మాటకు అందరూ అంగీకరించే నిర్వచనం ఒక్కటి లేదు.

సామ్యవాద పద్ధతి మనకు కొత్తదికాదు. మన రాజ్యాంగానికి విరుద్ధమూకాదు. శ్రేయోరాజ్య సిద్ధాంతానికి దీనికి వైరుధ్యమేమీ లేదు. ఇందులో కొత్త ఏమీ లేదని మన ప్రధాన మంత్రి అన్నారు. ఇప్పుడున్న పరిశ్రమలను సమూలంగా రద్దుచేసి, క్రొత్త ప్రపంచాన్ని మనం సృష్టించడం లేదు. సాంఘిక దృక్పథానికి మనం ప్రాధాన్య మిస్తున్నాం. ప్రైవేటు పరిశ్రమరంగం, న్యాయంలో, సాంఘిక నియమంలో వ్యవహరించి, సామాన్య మానవుని జీవిత పరిస్థితులను బాగు పరచడానికి తోడ్పడి, ఎక్కువ మందికి పనిపాటలు కల్పించుతూ వుంటే మన సమాజ పద్ధతిలో దానికి తప్పక స్థానం వుంటుంది. మనం సహజీవన సిద్ధాంతానికి కట్టుబడిన వాళ్ళం. అసమానత్వాలను తొలగించడానికి మనం జమీందారీ విధానాన్ని రద్దు చేశాం. పెద్ద ఆదాయలపై పన్నులు పెంచాం, కంపెనీ యాజమాన్య వ్యవహారాలను సంస్కరిస్తున్నాం. పేద ప్రజలకు ఎక్కువ సౌకర్యాలు కల్పిస్తున్నాం.

కేంద్రంలోను, రాష్ట్రాలలోను చేసిన శాసనాలను అధికారులే అమలు పరచాలి. ఇక్కడే అధికారులపై ఒక కొత్త బాధ్యత పడిందని వారు తెలుసుకోవాలి. బ్రిటిషు ప్రభుత్వం

పోలీసు రాజ్యాన్నీ, రెవిన్యూ పరిపాలనను ఏర్పరచింది. కాని ఇప్పటి వ్యవహారాలు వేరు. అంతకంటె ఎక్కువ విధులు ఇప్పటి పరిపాలనా యంత్రంపై పడ్డవి. కనుక అధికారుల కర్తవ్యం కూడా హెచ్చింది. అధికారుల వైఖరిలోను కర్తవ్యంలోను తీవ్రమైన మార్పు వచ్చింది. ఇప్పుడు మనం కోరేది శ్రేయోరాజ్యం కాబట్టి ఈ అధికార్లు కూడా జాతీయ, రాష్ట్రీయ, జిల్లాస్థాయీ మొదలుకొని గ్రామస్థాయి వరకూ శ్రేయోద్యోగులు—శిస్తులు వసూలు చేయడం, శాంతి భద్రతలు పోషించడమే కాక శ్రేయస్సు కల్గించడం కూడా వారి విధి. సామాన్య మానవునికి శ్రేయస్సును చేకూర్చడమే ఇప్పుడు ప్రధాన దృక్పథం. కనుక ఇదీ తప్పక పరిపాలనా వ్యవస్థలోను, అధికార్లలోను మార్పు తెస్తుంది. ప్రతివారు ఈ దృక్పథాన్ని అర్థం చేసుకోకపోతే మనమాశించే శ్రేయోరాజ్యం ఏర్పడదు. మన అధికార్లు ఇప్పటికే ఈ దృక్పథాన్ని అలవర్చుకున్నారు. వారి ఇప్పటి పాత్ర చరిత్రాత్మకమైనది. ఈ సంగతి తెలిసినవారే ఆ పాత్రను ప్రశంసించ గలగుతారు. అధికార్లలో కొన్ని లోపాలుండవచ్చు. కాని వారిలో ఎక్కువ మంది ముఖ్యంగా యువ తరం వారు కర్తవ్యతా పరాయణులు, న్యాయబుద్ధి గలవారు. అలా లేకపోతే వారు అసమర్థులుగా పరిగణింపబడి వెనుకకు నెట్టివేయబడుతారు దేశాభివృద్ధి కూడా కుంటుపడుతుంది.

అందరికంటె ముఖ్యుడైన జిల్లా అధిపతి విషయం చూడండి. ఈ కొత్త పద్ధతివల్ల అతని జీవితం యావత్తు మారింది. వెనుకటి కలెక్టర్లు వారానికి ౩౦ లేక ౪౦ గంటలు పని చేసేవాళ్ళు. ఇప్పటివారు ౧౦౦ గంటల పని చేస్తున్నారు, పరిపాలనా వ్యవహారాలే గాక సామాజికాభివృద్ధి ప్రాజెక్టులు జాతీయవికాస కేంద్రాలు, గ్రామాభివృద్ధి పనులు కూడా చూస్తున్నారు. జిల్లా కలెక్టర్లే జిల్లా అభివృద్ధి అధికారులు కూడా. జాతీయ నిర్మాణ శాఖల కన్నిటికి వారు సమన్వయం కలిగిస్తూ వుంటారు. క్రొత్త రకాన్ని సహకరిస్తూ ప్రాచీనమైన వాటిని చేర్చుకొని కొత్తదారులలో అభివృద్ధిని సాధిస్తూ వుంటారు. ఇప్పటి జిల్లా కలెక్టరు ప్రజల వక్త, పౌర సంబంధాధికారి, వ్యవస్థానిర్మాత, శరీర కష్టం చేసేవాడు జీపు డ్రైవర్, ఆహ్వానించే వ్యక్తి, ప్రయాణీకులకు మార్గదర్శి—ఇంకాఅనేకం. బహుముఖ్యమైన కార్యక్రమాలలో లో కేంద్ర మంత్రులను, చిన్న పెద్ద అధికారులను, ముఖ్య ప్రజానాయకులను, స్త్రీ కార్యకర్తలను, కార్మిక నాయకులను, మన సంఘంలో అన్ని తరహాల మనుషులను కలెక్టరు కలిసి, మాట్లాడవలసి వుంటుంది. మరి ఇది ఎంత ప్రశంసనీయమైన కార్యభారం? ఇలాగే కొంచెం తక్కువగా, తాలూకా గ్రామాధికార్లు చేయవలసి వుంటుంది. సాంఘిక న్యాయమనే భావమే వీరికి మార్గదర్శకంగా వుంటుంది. వీరు అనధికారులనుంచి, రాజకీయ వేత్తలనుంచి సహాయం, సహకారం ఆశిస్తారు. వారికి కావలసింది సహాయంగాని అజమాయిషీకాదు. అజమాయిషీ చేసేవారు వేరే వున్నారు. అనేక మంది కార్యకర్తలకు కలెక్టర్లు నిర్దేశకులు కాబట్టి తగు పదవులలో తగిన వారిని వారు నియమించవలసి వుంటుంది.

లేకపోతే ఆటసాగదు. మనుష్యుల నెన్నుకొనే సందర్భంలో అధికారిపై ప్రత్యక్షంగా లేక పరోక్షంగా వత్తిడి చేసినట్లయితే పరిపాలన సరిగా జరగదు. కాబట్టి రాజకీయ నాయకులు ఎంత తక్కువగా సిఫారసులను తెస్తే పరిపాలన అంత సమర్థవంతంగా సాగుతుంది.

సామ్యవాద పద్ధతి సమాజాన్ని తేవడంలో అధికార్లు కూడా అసమానత్వాలను తొలగించడానికి ప్రయత్నించాలి. భూములు గ్రాంట్లు, అప్పులను పంపిణీచేయడంలో పేదలకు ప్రాధాన్యమివ్వాలి గాని, సిఫారసులు వత్తిడితెచ్చే ధనవంతులకు కాదు. ప్రజలు కూడా అక్రమమైన పనిని చేయవలసిందిగా అధికారిని కోరకూడదు. అలా కోరుతూ లంచాలివ్వడం లేక అతన్ని బదిలీ చేయిస్తామనో, పదవినుంచి దింపిస్తామనో బెదరించకూడదు.

పైదంతా కార్యనిర్వాహక అధికారుల కర్తవ్యం. ఇక న్యాయాధికారుల వ్యవహారం, వీరు రాజ్యాంగానికి అనుగుణంగా శాసనానికి నిర్వచనం వ్యాఖ్య చెప్పాలి. క్రిమినల్ కేసులో నిందితునిపై మోపబడిన నేరము ఋజువగునంతవరకు అతనికి అనుకూలముగానే వుంటుంది. అది న్యాయస్థాన సంప్రదాయం. అలాగే ఆస్తికి సంబంధించిన చట్టాలకు అర్థం చెప్పేటప్పుడు కూడా దేశంలోని పేదలకే రాజ్యాంగం అనుకూలంగా వున్నట్లు కన్పిస్తుంది. మన రాజ్యాంగం వ్యక్తిని రాజ్యం నుంచి, రాజ్యాన్ని వ్యక్తినుంచి సంరక్షిస్తుంది. కొందరు వ్యక్తుల విత్తవ్యత్యాసాలవల్ల యావద్దేశం తారుమారు కాదు. అలాగే రాజ్యాంగం క్రింద వ్యక్తియొక్క ప్రాథమిక స్వత్వాలు దెబ్బతినకూడదు. పేద ప్రజల హక్కులకు ఉదారంగా వ్యాఖ్య చెప్పి మన న్యాయస్థానాధికారులు శ్రేయోరాజ్య స్థాపనకు తోడ్పడవచ్చు.

కాబట్టి, ఇంతకూ తేలినదేమంటే సామ్యవాద పద్ధతి జీవితంలో అధికారి పాత్ర ముఖ్యమైనది. ముఖ్యంగా దేశం బ్రిటిషు వారినుంచి విముక్తమైంది కనుక ఇప్పుడు ఇది చాల ముఖ్యం. ఇప్పుడు మన అధికారులు వహిస్తూ వున్న పదవుల పేర్లను మార్చే సంగతి ఆలోచించాలి. జిల్లా అధిపతిని భూమిశిస్తు కలెక్టరు అని పిలిచి అతడు ప్రజల శ్రేయాన్ని కూడా చూస్తూ ఉండాలని ఆశించడం బాగా లేదు. అయితే మరో విషయం కూడా వున్నది. గులాబీని ఏ పేరుతో పిలచినా దాని సువాసన ఎక్కడికి పోదుగా.

ఇటీవల రాష్ట్రపతి మన రాష్ట్రంలో సపరివారంగా పర్యటిస్తూవుండగా ఆ పరివారంలోని ఒక సభ్యుడు ఒక జిల్లా కలెక్టరుతో "అయితే మీరిక్కడి రాజాగారన్నమాట" అని అన్నాడు. అందుకు ఆ కలెక్టరు సమాధానమిస్తూ "లేదండీ నేనిక్కడ సేవకుడను" అన్నాడు. సామ్యవాద పద్ధతి సమాజంలో అదీ అధికారియొక్క పాత్ర.

# నృత్యం, సంగీతం

హిందూస్తానీ, కర్నాటక సంగీత నృత్య శాస్త్రాల అభివృద్ధికి హైదరాబాదు ప్రభుత్వం సాధ్యమయినంతవరకు కృషిచేస్తున్నది. ప్రజల సాంస్కృతిక అవసరాలను తీర్చేటందుకై ప్రభుత్వం హిందూస్తానీ కర్నాటక నృత్య సంగీత పాఠశాలను నెలకొల్పింది.

ఒకప్పుడు హైదరాబాదు రాష్ట్రం నృత్య సంగీత కళలకు నిలయంగా వుండేది. నృత్య సంగీత శాస్త్రములను గూర్చి ఉద్గ్రంథములను రచించిన సారంగదేవుడు దేవగిరి యాదవ రాజుల ఆస్థానానికి చెందినవాడు. కర్నాటక సంగీతంలో నిధియైన పురందరదాసు రాయచూరు జిల్లాలోని మాన్వీ ప్రాంతంలో కొంతకాలం నివసించాడు. తానాషా కాలంలో సిద్దయ్య ప్రతిపాదితమైన భరత నాట్యం గోలకొండ దర్బారులో రాజసన్మానాలు పొందింది. ఉత్తర దక్షిణ సంస్కృతులకీ రాష్ట్రం సంగమస్థానం కాబట్టి ఈ రాష్ట్రంలో హిందూస్తానీ కర్నాటక బాణీలు ప్రాపకం కలిగివుండేవి. ఇప్పుడు మళ్ళీ ఈ కళలు పునరుద్ధరింప బడుతున్నవి. వీటికి తగు ప్రోత్సాహమివ్వడానికి రాష్ట్ర ప్రభుత్వం శ్రద్ధవహిస్తున్నది. పర్యవసానంగానే ప్రభుత్వ నృత్య సంగీత పాఠశాల అవతరించింది.

ప్రభుత్వ హిందూస్తానీ కర్నాటక సంగీత నృత్య పాఠశాల ౧౯౫౨ ఆగస్టులో రాష్ట్రప్రజలకు లలిత కళలయందు శిక్షణ నిచ్చే ఉద్దేశంతో స్థాపించబడింది. ఈ సంస్థలో హిందూస్తానీ గాత్రం, సితార్, కర్నాటక గాత్రం, కర్నాటక వీణ, కథక్ నృత్యం, భరత నాట్యం నేర్పబడుతాయి.



ప్రభుత్వ నృత్య సంగీత పాఠశాల ప్రిన్సిపాల్ శ్రీ జి. యన్. దంతాలే వాయిద్య గోష్ఠి ని నిర్వహిస్తున్నారు.



శ్రీ టి. కె. నారాయణ్ నిర్వహిస్తున్న భరతనాట్యం [illegible]

పాఠశాలలకు, కాలేజీలకు, కార్యాలయాలకు హాజరయ్యేవారి సౌకర్యం నిమిత్తమై సంగీత నృత్యతరగతులు ఉదయం సాయంత్రం వేళల్లో ఏర్పాటు చేయబడినవి. ఈ సంస్థలో సహవిద్యావిధానం కలదు. దీనిలో ప్రవేశం కొరకు కనీస విద్యాయోగ్యత ఏమీ నిర్ణయించబడలేదు. తమతమ మాతృ భాషల్లో వ్రాయను, చదువను నేర్చిన వారందరూ ఈ పాఠశాలలో చేరే అర్హత కలిగి వున్నారు. అలాచేరిన వారంతా తమ వాయిద్య జంత్రములను తామే కొనుక్కోవలెను. పాఠ శాలలో కొన్ని జంత్రములు మాత్రమే లభించును.

పాఠశాల కోర్సులను, పాఠ్య ప్రణాళికలను, పరీక్షల నియ మావళిని తయారు చేసేటందుకు ఒక సలహా సంఘం కలదు. ఆ సంఘంలో అధికార్లు, అనధికార్లు వున్నారు. పాఠశాల యొక్క విద్యాబోధన సంవత్సరం క్యాలెండరు సంవత్సరంతో పాటే అంతమవుతుంది. పాఠశాలల్లో, కాలేజీలల్లో చదువు కొనేవారి విద్యా సంవత్సరం సాధారణంగా జూన్ నుంచి ఏప్రిల్ వరకు ఉంటుంది కాబట్టి వారి సౌకర్యార్థమై పై విధంగా ఏర్పాటు చేయనైనది. ఇందువల్ల వారికి తమ సాంవత్సరిక పరీక్షలకు చదువుకొవడానికి చాలినంత వ్యవధి లభిస్తుంది.

విద్యార్థులలోను, ఔత్సాహిక కళాకారులలోను సభా పిరికిని పోగొట్టడానికై పాఠశాల కోర్సులతో పాటు ప్రతి వారం పాఠశాలలోనే సంగీత కచేరీలు కూడా జరుపబడుతూ వుంటాయి.

హైదరాబాదు నృత్య, నాటక, సంగీత అకాడమీవారు ౧౯౫౮ లో రిపబ్లిక్ దినోత్సవాల సందర్భంలో ఏర్పాటుచేసిన

సంగీత నృత్య పోటీలలో ఈ పాఠశాల విద్యార్థులు అనేక బహుమతులు గెల్చుకొన్నారు. ప్రస్తుతం పాఠశాలలో శిక్షణ పొందుతున్నవారి సంఖ్య 300.

విద్యార్థుల మేలుకొరకై ఈ పాఠశాలవారు అఖిల భారత ప్రశస్తి పొందిన కళాకారుల చేత కర్నాటక హిందూస్తానీ సంగీత కార్యక్రమాలు జరిపిస్తూ వుంటారు. ఇట్టి కార్యక్రమాలలో కుమార గంధర్వ, డి. వి. పలూస్కార్, బాలారాం శాస్త్రి, అబ్దుల్ హాలీం జాఫర్ ఖాన్, మద్రాసుకు చెందిన శ్రీమతులు లలితా భాను రుక్మిణీగారలు, ఉస్తాద్ బందేగులాం అలీఖాన్, పండిట్ రవి శంకర్, ఉస్తాద్ అలీ అక్బరుఖాన్, ఉస్తాద్ హుసేన్, ద్వారం వెంకటస్వామి నాయుడుగారల సంగీత కచేరీలు కూడా కలవు.

౧౯౫౩ అక్టోబరు నెలలో ఈ పాఠశాలవారు ప్రధాన మంత్రి వరద బాధితుల సహాయనిధి కొరకు మూడు గంటల సేపు సంగీత నృత్య కార్యక్రమాన్ని ఏర్పాటుచేశారు. చాలా మంది ప్రేక్షకులువచ్చి దీనిని చూశారు. యూనియన్ ప్రభుత్వ సమాచార ప్రసార శాఖల మంత్రి డా. బి. వి. కేస్కార్ కూడా ఈ కార్యక్రమానికి హాజరై, పాఠశాలను చూచి తమ సంతృప్తిని వెల్లడించారు.



శ్రీ ఆర్. శుక్లా నిర్వహిస్తున్న కథక్ నృత్యం తరగతి

# ౧౮౫౦౦ ఎకరాల పడావా భూముల సాగుదల

## బీదరు, ఉస్మానాబాదు, గుల్బర్గా, ఔరంగాబాదు జిల్లాలలో

## ఆటవీశాఖ కృషి

బీదరు, ఉస్మానాబాదు, గుల్బర్గా, ఔరంగాబాదు జిల్లాలలో అటవీశాఖవారు సేద్యం లేకుండా బీడుపడివున్న సువిశాల ప్రాంతాలను సేద్యయోగ్య మైన భూములుగా మార్చుతున్నారు. ఇంతవరకు ౧౮,౫౦౦ ఎకరాల భూమి క్రొత్తగా దున్న బడింది. ఈ పని ఇంకను త్వరగా కొనసాగుతున్నది. అడవుల చీఫ్ కన్సర్వేటరు రాష్ట్రంలో ఈ పనికై అవలంబించ బడుతున్న పద్ధతులను, ఆటవీశాఖ చేస్తున్న కృషిని గూర్చి ఈ క్రింది వ్యాసంలో వివరిస్తున్నారు.

భారతదేశపు ఇతర రాష్ట్రాల వలెనే, హైదరాబాదు రాష్ట్రం కూడా వ్యావసాయ ప్రధాన ప్రాంతం. దీని వైశా ల్యం ౮౨౧౬౮.౩ చ. మైళ్లు. ఇందులో ౪౦౪౭.౩ చ. మై. ప్రాంతం అంటే ౪౯.౧ శాతం సేద్యం క్రింద ఉన్నది. ౧౨౮౨౧.౯౯ చ. మై. ప్రాంతం అంటే రాష్ట్రం మొత్తం విస్తీర్ణం లో ౧౫.౬ భూమి శాతం అటవీ ప్రాంతంగా వర్గీకరించ బడింది. రాష్ట్రం సహజంగా ౧. మరాట్వాడా, కర్నాటక ప్రాంతం ౨. తెలంగాణా ప్రాంతమని రెండు భాగాలుగా విభజింపబడియున్నది.



ప్రభుత్వ అటవీశాఖ కృషివల్ల బీదరు జిల్లాలో కందకాలు త్రవ్విన ప్రాంతాలలో గడ్డి ఉత్పత్తి ౨౭౫ శాతం పెరిగితే ఉస్మానాబాదు జిల్లాలో ౨౩ శాతం పెరిగింది.



ఒకప్పుడు బీదరుజిల్లాలో ఎడారులవలె వున్న ప్రాంతాలు ఎనిమిదేండ్ల కాలంలోనే చెట్లు చేమలతో, పచ్చిక బయళ్ళతో శోభాయమానంగా వున్నవి.

రాష్ట్ర పశ్చిమ భాగ విస్తీర్ణం ౪౦౭౨౬.౪౫ చ. మై. ఉంది. ఇందులో ౨౮౧౩౯.౦౯ మైళ్ల ప్రాంతం సేద్యం క్రింద ఉన్నది. అడవుల క్రింద ౧,౨౦౪.౬౪ చ. మై. ప్రాంతం అంటే ౩.౪౩ శాతం ప్రాంతం మాత్రమే ఉన్నది. అయితే తెలంగాణా ప్రాంతం విస్తీర్ణం ౩౮౬౪౮.౯౪ చ. మై. ఉంది. ఇందులో ౧౪౬౭౧.౪౫ చ. మై. ప్రాంతం సేద్యం క్రిందనూ, ౧౧,౨౪౩.౮౦ చ. మై. ప్రాంతం లేక ౨౯.౦౯ శాతం ప్రాంతం అడవుల క్రిందనూ ఉన్నది. బీడు పడిన భూములు, సేద్యయోగ్యం కాని భూములు, సేద్యయోగ్యమై ఉండీ పడావా పడివున్న భూములు, ఇతరత్రా ఉన్న భూముల విస్తీర్ణం మొత్తం ఈ రెండు ప్రాంతాలలో ఈ క్రింది విధంగా ఉంది.

| | | | చ. మై. |
|---|---|---|---|
| ౧. | మరాట్వాడా కర్నాటక ప్రాంతం | — | ౨౧౬౪.౯౧ |
| ౨. | తెలంగాణా ప్రాంతం | — | ౪౧౮౩.౦౨ |
| | మొత్తం | — | ౬౩౪౭.౯౩ |

రాష్ట్రంలో తూర్పు ప్రాంతం నుంచి అడవులు క్రమేణా అంతరించి పోవడం, పశ్చిమ దిశన సారవంతమైన మన్ను విపరీతంగా కొట్టుకొని పోవడం, ౬౩౪౭.౯౩ చ. మై. ప్రాంతం క్రమేణా బీటలు వారి పోవడం, ఇవన్నీ సంవత్సరమున సగటు వర్ష పాతం తక్కువగా ఉండడానికి, భూగర్భంలో నీటి మట్టం—వాటర్ టేబిల్—ఇంకనూ లోపలికి పోవడానికి కారణాలై ఉన్నాయి. పచ్చికబయళ్ళు క్షీణించినాయి. నదులలో బురద ఎక్కువవుతూ, ప్రతి సంవత్సరం ఒడ్డులను కోసి వేస్తూ వాటి వెడల్పు ఎక్కువై, వరదలు వచ్చినపుడు చుట్టు ప్రక్కల ప్రాంతాలకు విపత్తు కలుగుతున్నది. వంటచెరుకుకు, గృహ నిర్మాణానికి కలపకూ లోటుగా ఉన్నది. సకాలంలో తగు చర్యలు తీసుకోనట్లయితే రాష్ట్రం ఒక ఎడారిగా మారి పోయే ప్రమాదం ఏర్పడవచ్చు.

భూమి కోత పడడాన్ని నిరోధించడం, అడవుల పెంపకం పనులు.

రాష్ట్రం ౧౯౪౪ సం. లో ఈ విపత్కర పరిస్థితులను గుర్తించి, బాగా దెబ్బతిన్న జిల్లాలైన బీదరు, గుల్బర్గా

ఔరంగాబాదులలో పై సమస్యలను పరిష్కరించుటకు పూను కొన్నది. అటవీశాఖ ౧౯౪౭ సం. నాటికి ఈ జిల్లాలో అడవులు పెంచుటకు ౪౧౨౫ ఎకరాలలో చెట్లు నాటింది. అయితే, ఈ పని ఏ ప్రణాళిక ప్రమేయం లేకుండానే ఆరంభిం చబడింది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక అంతిమంగా రూపొంది అమల్లో పెట్టబడేంత వరకు ఈ పని ఆపుదల చేయబడింది. అటవీశాఖ ఈ పనులకు అధిక ప్రాధాన్యం ఇచ్చింది. ప్రతి సంవత్సరం ౨౫౦౦ ఎకరాలలో అంటే బీదరులో ౨,౦౦౦ ఎకరాలు, ఉస్మానాబాదులో ౫౦౦ ఎకరాలలో చెట్లు నాటుటకు నిర్ణయించబడింది. ఈ ప్రణాళిక ౧౯౫౧ సం. లో ఆరంభించబడింది.

## నిరోధక చర్యలు

సువిశాలమైన బీటలు వారిన ప్రాంతాలను దున్ని సేద్యయోగ్య మైన భూములుగా మార్చడం సులభమైన పని కాదు. ఇందుకుగాను ఒం ప్రథమంగా భూములు వరదలవల్ల ఒరుసుక్క పోవడాన్ని అరికట్టి, వరద కట్టలు పోయడం ద్వారా వర్షపు నీటి తీవ్రవేగమును నిరోధించి, అది కొండలు కోనలు, కనుమల గుండా ప్రవహించకుండునట్లు తగు చర్యలు గైకొనబడాలి. ఇక రెండవ చర్య ఏమంటే వర్ష ప్రవాహాన్ని అదుకొనే వృక్షజాలములను నాటాలి. ఒక దాని తరువాత ఒకట "గ్రడోని రకం" ( 2 × 1½ క్రాస్ సెక్షన్) వంటి వరద కట్టలు పోయు పద్ధతి అవలంబించబడింది. ఈ కట్ట నుంచి త్రవ్వగా తీయబడిన మట్టి, కొంతవరకు తిరిగి వేయ బడుతుంది. ఏట వాలుగా ఉండు ప్రాంతంలో చెట్ల విత్తనాలో లేక మొక్కలో నాటబడుతాయి.

## వరద కట్టలు పోసేపద్ధతి

ఈ ప్రాంతాల్లో ఉండే క్లిష్టపరిస్థితులను బట్టి, ఏట వాలుగా ఉన్న విశాల ప్రాంతాన్ని చిన్నచిన్న భాగాలుగా విభజించడం ద్వారా వరద కట్టలు పోయు పద్ధతి అవలంబించ బడింది. ఈ కట్టలు పై భాగం నుంచి క్రింది భాగానికి వచ్చే ఎక్కువ వర్షపు నీటిని తీవ్రంగా పారకుండా నిరోధించ గలుగుతాయి. కనుక నీటి ప్రవాహం కొంతవరకు నిర్బం



అటవీశాఖచే బీదరు జిల్లాలో నిర్వహించబడుతున్న వరద కట్టల నిర్మాణ కార్యకలాపాలు



వరదకట్టల నిర్మాణంకొరకై విశాలమైన భూఖండాలను చిన్న చిన్న మళ్ళుగా విభజించడం జరుగుతుంది.

ధించబడడం వల్ల, ఆ తరువాత ఏ ఇతర యూనిట్‌లోనైనా నీరు ఎక్కువగా ఉండినట్లయితే దానిని అదుపులో ఉంచడం చాలావరకు సులభసాధ్యమవుతుంది.

| జిల్లా పేరు | పనిజరిగిన సంవత్సరం | రక్షింపబడిన ప్రాంతం—ఎకరాలలో |
|---|---|---|
| ౧. గుల్బర్గా, ఔరంగాబాదు అడవుల పెంపకపు డివిజన్లు | ౧౯౪౫—౧౯౪౬<br>౧౯౪౭—౧౯౪౮ | ౪,౨౧౫ |
| ౨. బీదరు | ౧౯౫౦—౧౯౫౨ | ౧౯౫ |
| 3. బీదరు, ఉస్మానాబాదు | ౧౯౫౧—౧౯౫౨ | ౨,౧౫౦ |
| ౪. బీదరు, ఉస్మానాబాదు | ౧౯౫౨—౧౯౫3 | ౭౬౦ |
| ౫. బీదరు, ఉస్మానాబాదు | ౧౯౫3—౧౯౫౪ | ౫,౨౫౯ |
| ౬. బీదరు, ఉస్మానాబాదు హైదారాబాదు, ఔరంగాబాదు | ౧౯౫౪—౧౯౫౫ | ౫,౮౪౨ |
| మొత్తం | | ౧౮,౪౨౧ |

నాటబడిన చెట్లు

౧౯౪౫ నుంచి ౧౯౪౮ వరకు నాల్గేండ్లలో ముఖ్యంగా అడవులలో నాటబడే చెట్లు ఐదు రకాలుగా నాటబడినాయి. వీటిల్లో కేసియా సయామియా అనే రకం చెట్లు మాత్రం బాగా పైకి వచ్చినాయి. ఇవేగాక మరొక ఏడు రకాల చెట్లు కూడా నాటబడినాయి. పంచవర్ష ప్రణాళిక కార్యక్రమాల క్రింద కూడా కొత్తగా చెట్లు నాటబడుతున్నాయి.

వరదకట్టల ప్రభావం

వరదకట్టలు పోయడంవల్ల భూమిలో తేమ ఎక్కువ అయినట్లు కనుగొనబడింది. వరదకట్టలు పోసిన ప్రాంతాలలోను పోయని ప్రాంతాలలోను వివిధ భూములలోపల నుంచి మట్టిత్రవ్వి, వాటిలో ఎంత తేమ ఉందో పరిశీలింపబడింది. భూమట్టానికి ౨౧ అంగుళాలలోతున ఈ రెండు రకాల మట్టి త్రవ్వగా వాటిలో తేమ నిష్పత్తి ౧౬ : ౧ ఉండింది.

(మిగతా ౪౪వ పేజీలో)

# గ్రామాలకు అధికంగా రేడియో సెట్లు

ప్రజా బాహుళ్యానికి విద్యా వైజ్ఞానిక విషయాలను బోధించే దేశవ్యాప్త కార్యక్రమంలో ఒక భాగంగా ఆలిండియా రేడియోవారు ప్రాంతీయ భాషలలో తాము ప్రసారంచేసే గ్రామసీమ కార్య క్రమాలను, ఇతర కార్యక్రమాలను అభివృద్ధి పరచి గ్రామ ప్రజలు తమ విజ్ఞానాన్ని, ఆరోగ్యాన్ని, ఆర్థిక పరిస్థితిని బాగు పరచుకొనేందుకు తోడ్పడటానికై విశేషంగా కృషిచేస్తున్నారు.

గ్రామస్తులు ఈ కార్యక్రమాలనుంచి పూర్తిగా లాభం పొందాలంటే, సాధ్యమైనన్ని గ్రామాల్లో, కేంద్ర స్థలాల్లో అనువైన రేడియో సెట్లులు ఉండడం అవసరం. ఇవి ఉన్నట్లయితే ప్రజలు తమ గ్రామంలో సాయంత్రం ఒక చోట గుమికూడి కార్య క్రమాలు వినుటకు వీలుంటుంది.

ఎన్నో పరిశోధనలు చేసిన పిమ్మట, అనువైన రేడియో సెట్టు నమూనా ఒకటి తయారు చేయబడింది. ఇది సక్రమంగా నడవడమే గాక, దీని ఖరీదు కూడా ఇతర రేడియో సెట్టులతో పోల్చినట్లయితే, చాలా తక్కువగా ఉంటుంది.

రాష్ట్రంలో రేడియో సర్వీసు సామర్థ్యాన్ని పెంపొందించి ఇది సర్వీసు చేయగల ప్రాంతాన్ని విస్తృత పరచుటకు హైదరాబాదు ప్రభుత్వ సమాచార, పౌర సంబంధముల శాఖ కృషి చేస్తూన్నది. ఈ శాఖ ౫౦ రేడియో సెట్టులను తయారు చేసింది. ఇప్పుడివి నెలకొల్ప బడుటకు సిద్ధంగా వున్నవి. త్వరలోనే, భారత ప్రభుత్వంనుంచి మరొక ౮౦౦ సెట్టులు రాగలవని ఆశింపబడుతున్నది. ఇవికూడా పంచాయితీగ్రామాలు సహకార సంఘాలు, స్కూళ్ళు, ఇతర రాజకీయ ప్రమేయము లేని సంస్థలు, సంక్షేమ సంస్థలకు లభించగలవు.

(౫౮వ పుటచూడుడు.)



దక్షిణ భారతంలో రాష్ట్రపతి నిలయంగా బోలారం రెసిడెన్సీని అప్పగించిన సందర్భంలో రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్ర ప్రసాద్‌గారు ప్రసంగిస్తున్న దృశ్యం. బోలారం రెసిడెన్సీ భవనాన్ని రాష్ట్రపతికి అప్పగించిన రాజప్రముఖ్‌గారు వారికి కుడిప్రక్కన ఆసీనులై వున్నారు. వేదికపై రాష్ట్రపతి సతీమణి శ్రీమతి రాజవంశదేవి, రాష్ట్ర ముఖ్యమంత్రి డా. బి. రామకృష్ణారావు గారలున్నారు.

(౨౮వ పేజీ తరువాయి)

వలె గాక బాలునివలె పెంచబడింది. పురుషవేషాన్ని ధరించి ఈమె తిరుగుతూ ఉండేది. ఈమెను పురుషుని గానే సంబోధించేవారు. పొరుగు రాజులైన యాదవుల వల్ల కొంత క్లిష్ట పరిస్థితి ఏర్పడ్డప్పటికీ, స్త్రీ పరిపాలనను సహించలేని ఒకరిద్దరు సామంతులు వ్యతిరేక వైఖరి ప్రదర్శించినప్పటికీ ఈమె తన రాజ్యాన్ని చెక్కు చెదరనీకుండ కాపాడి తన మనుమడైన ప్రతాపరుద్రదేవునికి పట్టం గట్టింది. కాకతీయ రాజులలో ఇతడే చిట్ట చివరి స్వతంత్ర రాజు. ప్రతాప రుద్రుడు కాకతీయ వంశరాజులు పాలించిన ప్రాంతమంతటి పైనను తన అధికారాన్ని ప్రతిష్ఠాపించి పరిపాలింపసాగినాడు సైనిక వ్యవహారాలలో ఇతడు తన పూర్వీకుడైన గణపతిదేవుని అనుసరించేవాడు. కాని దక్షిణంలోని చిన్నరాజ్యాలకంటె ఇతడు అతి బలీయమైన ఒక శత్రువును ఎదుర్కో వలసి వచ్చింది. ఇతని సేనానులు దక్షిణ దేశం పై దిగ్విజయ యాత్రచేసి తమిళరాజులపై విజయాలు పొందారు. కానీ ఉత్తరాన వున్న మహమ్మదీయ రాజులను వారు జయించలేక పోయ్యారు. ఓరుగల్లు కోటలో వుండి ముస్లిం రాజుల దండయాత్రనుండి వారు తమను తాము రక్షించుకోవలసి వచ్చింది దక్కను పీఠభూమి నంతటినీ తమ ఆక్రమణ క్రిందికి తీసుకోవలెనని నిర్ణయించుకొని ముస్లిం రాజులు దండయాత్రకు బయల్వెడలగానే, దక్షిణ దేశ రాజులకు ఓటమి తప్పలేదు. కొంతకాలం వీరు కప్పములు చెల్లిస్తామని, సామంత రాజులుగా ఉంటామని వాగ్దానములు చేసి ప్రమాదాన్ని తప్పించుకున్నారు. అయితే ఆవాగ్దానాలను చెల్లించుకోలేకపోవడం చేత చివరకు ఓటమి పొందారు. క్రీ. శ. ౧౩౨౬ లో ప్రతాప రుద్రదేవుడు పట్టుబడ్డాడు. అతణ్ణి ఖైదీగా జేసి ఢిల్లీకి తీస్కొనిపోతుండగా అతడు ఓటమి వల్ల కలిగిన అవమానాన్నివ్యాకులాన్నిభరించలేక నర్మదానదితీరాన ఆత్మహత్య చేసుకున్నాడు.

(౧౮వ పేజీ తరువాయి.)

ఈ విధంగా నాగార్జున సాగర్ ప్రాజెక్టు క్రింద వుండే మొత్తం ఆయకట్టు ౩౧.౮౩ లక్షల ఎకరాలు. ఇదిగాక కృష్ణాడెల్టాలో మొదటి పంట క్రిందికి అదనంగా ౧.౫౦ లక్షల ఎకరాల భూమి వస్తుంది. ఏటా ౧౩ లక్షల టన్నుల ఆహార ధాన్యాలు పండుతాయి.

ఎడమవైపు కాలువవల్ల నల్లగొండ జిల్లాలోని మిర్యాల గూడెం, హుజూర్‌నగర్ తాలూకాలు, ఖమ్మం జిల్లాలోని ఖమ్మం, పాల్వంచ,- మధిర తాలూకాలు, ఆంధ్ర రాష్ట్రంలోని నందిగామ తాలూకా లాభపడతాయి.

కుడివైపు కాలువవల్ల ఆంధ్ర ప్రాంతంలోని కర్నూలు, గుంటూరు, కృష్ణా, నెల్లూరు జిల్లాలు లాభపడతాయి.

నాగార్జున కొండ డాముక్రింద విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి 300 అడుగుల హెడ్ లభిస్తుంది. ఎల్లప్పుడూ విడువకుండా ౭౫,000 కిలోవాట్ల జలవిద్యుత్తు ఉత్పత్తిచేయవచ్చు. పైగా వర్షఋతువులో జూలై నుంచి అక్టోబరు వరకు మధ్యరకం విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేయవచ్చు.

ఈ ప్రాజెక్టుకు మొత్తం రూ. ౧౨౨.౦౨ కోట్లు ఖర్చు అవుతాయి. ఇందులో హైదరాబాదు రాష్ట్రం రూ. ౩౨.౭౮ కోట్లు ఆంధ్ర రాష్ట్రం రూ. ౮౯.౨౩ కోట్లు భరిస్తాయి

## నాంది ప్రస్తావన

హైదరాబాదు ముఖ్యమంత్రి డా. బి. రామకృష్ణారావు గారు కుగ్రామమైన నందికొండ సమీపంలో కృష్ణానదికి అభిముఖంగా వున్న కొండ శిఖరంపై ఒక మామిడి మొక్క నాటారు. దీనితో ఈ నదిపై బహుళార్థ సాధకమైన నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణానికి హైదరాబాదువైపు లాంచన ప్రాయంగా నాంది జరిగినట్లే. ముఖ్యమంత్రిగారు ఆగస్టు ౨౨వ తేదీన డాము స్థలాన్ని సందర్శించి, పెద్దవూరు నుంచి ఆనకట్ట వరకు కొండలూకోనలకు అడ్డంగా నిర్మించ బడుతున్న ౧౨ మైళ్ళ రోడ్డును పరిశీలించినారు. ఆనకట్ట ప్రాంతం నందికొండ గ్రామానికి తూర్పు దిక్కున ౧ న్నర మైళ్ళ దూరంలో వుంది. ఈ ప్రాజెక్టుకు మొదట ఆ గ్రామం పేరే పెట్టబడింది.

కృష్ణానదికి ఇరుప్రక్కలవున్న రెండు కొండలపైగల రెండు చిన్నగుడిసెలున్నచోట్ల ప్రాజెక్టుకు శంకుస్థాపన జరుగు సమయంలో రెండు పెద్ద స్తంభాలు నిర్మించబడుతాయి. మన ప్రధాన మంత్రి డిసెంబరు నెలలో ఈ ప్రాజెక్టుకు ప్రారంభోత్సవం చేస్తారు. ఆలోపల నదికిరుప్రక్కల మనుష్యుల రాకపోకలకు, సరుకుల రవాణాకు సౌకర్యం కల్పించడానికై రహదారుల నిర్మాణం చురుకుగా కొనసాగుతున్నది. ఆంధ్ర రాష్ట్రం వైపున మాచెర్ల రైలు స్టేషనునుంచి ఆనకట్ట స్థలం వరకు ౧౩ మైళ్ల నిడివి రోడ్డు వేయడం పూర్తి అయింది. నది ఒడ్డు వరకు విద్యుచ్ఛక్తి తీగెలు కూడా వేయబడినవి. హైదరాబాదు వైపున పెద్దవూరు నుంచి ఆనకట్ట ప్రదేశం వరకు ౧౨ మైళ్ల రోడ్డును వేయడానికి బుల్‌డోజర్లు, ట్రాక్టర్ల సహాయంతో వేలాది స్త్రీ పురుషులు పని చేస్తున్నారు.

ముఖ్య మంత్రిగారు ఇక్కడ ఒక బహిరంగ సభలో ప్రసంగిస్తూ ఆనకట్ట ప్రాంతంలో వుండే ప్రజలు ఈ కార్యక్రమం వల్ల లాభం పొంది ప్రాజెక్టు నిర్మాణానికి కావలసిన కూలీలను లభింపజేసి ఇతర అవసరాలను కూడా తీర్చవలసిందిగా చెప్పారు. పదేండ్ల పాటు జరిగే ఈ నిర్మాణంవల్ల జిల్లా చాలా లాభ పడగలదనీ ఆ తరువాత నీటి పారుదల సౌకర్యాలు ఏర్పడి ఆ ప్రాంతమంతా సస్యశ్యామలం కాగలదనీ తెలిపారు.

# రోడ్లకు, భవనాలకు రూ. ౧౨౦ లక్షల ఖర్చు

## రెండవ పంచవర్ష ప్రణాళికలో పెద్ద మొత్తం వెచ్చింపు



౧౯౫౫ ఆగస్టు ౧౫ తో అంతమైన సంవత్సరంలో పబ్లికు వర్క్సుశాఖ యొక్క రోడ్లు, బిల్డింగుల విభాగం అమలు జరిపిన ప్రధాన కార్య క్రమాలలో పంచవర్ష ప్రణాళిక పథకాలను అమలు జరుపడం, పంచవర్ష ప్రణాళికలో లేనట్టి ఇతరపనులను చేపట్టడం, సాధారణంగా జరుగవలసిన మరమ్మతు పనులను చేయించడం—ఇవి చాలా ముఖ్యమైనవి. ఈ పను లన్నిటికి దాదాపు రూ. ౧౨౦ లక్షలు ఖర్చు అయినవి.

రాకపోకల సౌకర్యాలు.

రాష్ట్రంలోని రోడ్లు, వంతెనల నిర్మాణంకొరకై ఈ రాష్ట్రంలో దాదాపు రూ. ౪౭ లక్షలు ఖర్చయింది. ఇక ఫలితాలు ఇవి :—

౧. గుల్బర్గా జిల్లాలో గుల్బర్గా షోరాపూరు రోడ్డుపై ౧౫ నెలల కాలంలో భీమా నదిపై రూ. ౧౫ లక్షల ఖర్చుతో పెద్ద వంతెన నిర్మాణం పూర్తిచేయబడింది.

౨. ఔరంగాబాదు—అహ్మద్‌నగర్ రోడ్డుపై షివ్‌నా నదిమీద దాదాపు ౨.౨౫ లక్షల ఖర్చుతో హైలెవల్ కాజ్వే (అడ్డదారి) నిర్మింపబడింది. ఈ వంతెనపై రాకపోకలకు కేంద్ర సాంఘిక సంక్షేమ సలహా సంఘం అధ్యక్షురాలు శ్రీమతి విమలా బాయి మేల్కోటే ప్రారంభోత్సవం సల్పింది.

3. కరీంనగర్ జిల్లాలో కరీంనగర్—కామారెడ్డి రోడ్డుపై గోరెంట్లవాగు మీద హైలెవల్ కాజ్వే (అడ్డదారి) నిర్మాణం పూర్తి అయింది. ఈ వంతెనకు రాష్ట్ర పబ్లికు వర్క్సు మంత్రి డాక్టర్. జి. యస్. మేల్కోటే ప్రారంభోత్సం జరిపారు.

౪. ఆదిలాబాదు జిల్లాలో గూడి—హత్నూర్—ఉట్నూర్ రోడ్డుపై కట్టవలసిన నాలుగు వంతెనలలో మూడు వంతెనల నిర్మాణం పూర్తి అయింది.

౫. ఆరు జిల్లాలో మొత్తం ౧౨౬ మైళ్ళ పొడవు గల ౧౩ రోడ్లను నిర్మించి వాటిని ప్రజల రాకపోకలకు తెరువడమైనది.

౬. బీదర్ జిల్లాలో వున్నటువంటి జాతీయ రహదారికి ౭౦ మైళ్ల మేరకు రూ. ౧౩ లక్షల ఖర్చుతో నల్లటాపు వేయుట.

౭. రాష్ట్రంలో ఇంకా ౫౦ మైళ్ల రోడ్లకు రూ. ౬ లక్షల ఖర్చుతో నల్లటాప్ వేయుట.

౮. పట్టణాలగుండా పోయ్యే రోడ్లకు రూ. ౨—౭౫ లక్షల ఖర్చుతో ౨—౨౫ మైళ్ల పబ్లికు వర్క్సు రోడ్లకు సిమెంటు కాంక్రీటు వేయుట.

౯. భారత ప్రభుత్వం ఇచ్చే రూ. ౧౦౦ లక్షల గ్రాంటు సహాయ కార్యక్రమం క్రింద తొమ్మిది రోడ్ల పనుల సర్వేలు డిజైనులు, అంచెనాలు తయారు చేయుట.

౧౦. జాతీయ రహదార్ల ప్రథమ పంచవర్ష ప్రణాళిక క్రింద దాదాపు రూ. ౪౯ లక్షల ఖర్చులో ఎనిమిది జాతీయ రహదార్ల అభివృద్ధి పనులు ప్రారంభింపబడినవి.

౧౧. రాష్ట్ర రోడ్ల అభివృద్ధికి రూ. 33.౫౯ కోట్లు ఖర్చు అయ్యే రెండవ పంచవర్ష ప్రణాళిక తయారు చేయ బడింది. ఈ ప్రణాళిక క్రింద ౧౯౬౦—౬౧ తో అంతమయే అయిదు సంవత్సరాల కాలంలో రూ. ౨౦.౫౦ కోట్ల ఖర్చుతో కార్యక్రమాలు అమలు జరుపబడుతాయి.

౧౨. రాష్ట్రంలోని జాతీయ రహదార్ల అభివృద్ధికి రూ ౨—౬౪ కోట్లు ఖర్చు అయ్యే రెండవ పంచవర్ష ప్రణాళిక తయారు చేయబడింది. ఈ ప్రణాళిక క్రింద ౧౯౬౦—౬౧ తో అంతమయ్యే అయిదేండ్ల కాలంలో రూ. ౨—౧౯ కోట్ల ఖర్చులో కార్యక్రమాలు అమలు జరుగుతాయి. ఈ కార్య

క్రమాలలో సామాజికాభివృద్ధి కార్యక్రమం క్రింద జరిగే గ్రామ

భ వనములు:—

రూ. 3౮.౧3 లక్షల ఖర్చుతో ఈ క్రింది వనులు ప్రారంభింపబడినవి. :—

౧. రూ. ౭.౫౦ లక్షల ఖర్చుతో సికిందారాబాదు కె. ఇ. యం. ఆసుపత్రి విస్తరణ. ఈ పనిసాగుతున్నది.

౨. రూ. 3.౯౬ లక్షల ఖర్చుతో నాందేడ్ సివిల్ ఆసుపత్రికి క్రొత్త భవనాన్ని నిర్మించడం. ఈ పని సాగుతున్నది.

3. రూ. ౧.౫౬ లక్షల ఖర్చుతో నాందేడులో బాలికల ఉన్నత పాఠశాల భవన నిర్మాణం. ఈ పనిసాగుతున్నది.

౪. రూ. ౦.౭౧ లక్షల ఖర్చుతో నాందేడులో సాంకేతిక ఉన్నత పాఠశాలకు అదనంగా బ్లాకుల నిర్మాణం. ఈ పని పూర్తిఅయింది.

౫. రూ. ౦.౫౧ లక్షల ఖర్చుతో నిజామాబాదు సాంకేతిక ఉన్నత పాఠశాలకు అదనంగా ఒక బ్లాకు నిర్మాణం. ఈ పని పూర్తికావస్తున్నది.

౬. రూ. ౨.౪౬ లక్షల ఖర్చుతో కరీంనగర్‌లో సివిల్ ఆసుపత్రి నిర్మాణం పని జరుగుతున్నది.

౭. రూ. ౦.౭౮ లక్షల ఖర్చుతో ఆదిలాబాదులో జిల్లా కేంద్ర ఆసుపత్రి నిర్మాణం పని జరుగుతున్నది.

౮. రూ. ౫.౨3 లక్షల ఖర్చుతో వరంగలులోని ఆసుపత్రికి శానిటరీ ఎలక్ట్రిక్ ఫిట్టింగ్సు ఏర్పాటు చేయుట. ఈ పని పూర్తి అయింది.

౯. రూ. ౦.౭౬ లక్షల ఖర్చుతో బొలారం ఉన్నత పాఠశాల నిర్మాణం. ఈ పని జరుగుతున్నది.

౧౦. రూ. ౦.౯౭ లక్షల ఖర్చుతో బీడ్ జిల్లాలోని పల్లిలోమాధ్యమికపాఠశాల నిర్మాణం. ఈ పని జరగుతున్నది.

౧౧. రూ. ౦.౯౭ లక్షల ఖర్చుతో ఉస్మానియా జనరల్ ఆసుపత్రిలో రెండు బెడ్ల లిఫ్ ఏర్పాటు చేయుట—ఈ పని పూర్తి అయింది.

౧౨. లక్ష రూ. ల ఖర్చుతో హైదారాబాదులోని మల్లేపల్లి, స్క్రీన్ ఇన్‌స్టిట్యూట్ నిర్మాణం. ఈ పని జరుగుతున్నది.

౧3. రూ. ౦.౯౫ లక్షల ఖర్చుతో నిజామాబాదు జిల్లా ఆర్మూరులో ఉన్నత పాఠశాల నిర్మాణం పని జరుగుతున్నది.

౧౪. హైదారాబాదులో తాత్కాలిక సెక్రటేరియేట్ లో పలి రోడ్డుకు రూ. ౧.౦౭ లక్షల ఖర్చుతో సిమెంటు కాంక్రీటు చేయడం. ఈ పని పూర్తి అయింది.

౧౫. రూ. 3.౪౬ లక్షల ఖర్చుతో వరంగలు జిల్లా మామునూరు లోని మిలిటరీ భవనాల నిర్మాణం. పని జరుగుతున్నది.

౧౬. ఉప్పల్ లోని కేంద్ర పరిశోధనాలయంలో 3, ౪, పైలట్ ప్లాంట్లను రూ. ౧.౮౪ లక్షల ఖర్చుతో నిర్మించుట.

౧౭. రూ. ౦.౬౫ లక్షల ఖర్చుతో గుల్బర్గాలో పవర్ హౌస్ నిర్మాణం. ఈ పని పూర్తి అయింది.

ఇవేగాక రూ. ౨౦.౨౬ కోట్ల ఖర్చు అయ్యే భవన నిర్మాణ కార్యక్రమం రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్చ బడింది. ఆ ప్రణాళిక క్రింద ౧౯౬౦—౬౧ తో అంతమయ్యే ఐదేండ్ల కాలంలో రూ. ౯.౯౧౨ కోట్లు ఖర్చు పెట్టే కార్యక్రమములు అమలు జరుపబడుతాయి. ఈ కార్యక్రమంలో సామాజికాభివృద్ధి కార్యక్రమానికి సంబంధించిన భవనాలు కూడా చేరి వుంటవి.

నీటి సరఫరా

హైదరాబాదు, సికిందరాబాదు నగరాల జనాభా ఎక్కువైనది కాబట్టి ఇక్కడ త్రాగే మంచినీరు సరఫరాను అధికం చేయడానికై గత కొన్నేండ్లలో దొరికిన డబ్బును బట్టి అంచెలవారీగా ఒక రీమోడలింగ్ స్కీము పని ప్రారంభింప బడినది. ఈ సంవత్సరం రూ. ౪౬.౨౯ లక్షల ఖర్చుతో ౪వ అంచె పనిచేపట్టబడింది. ఈ ఉభయ నగరాలకు కావలసి నంత నీటిని సరఫరా చేసేటందుకై దేవనూరు రిజర్వాయరు నుంచి నీటిని ఉస్మాన్‌సాగర్, హిమాయిత్‌సాగర్ చెరువులలోకి పెట్టడానికై రూ. ౨.౬౪ కోట్లు ఖర్చుఅయ్యే ఒక పథకం తయారు చేయబడింది.

పి. డబ్ల్యు. డి. వర్కుషాపు

ప్రస్తుతంవున్న పి. డబ్ల్యు. డి. వర్కుషాపును పునర్వ్యవస్థీకరించేందుకై రూ. ౦.౪౨ కోట్లు ఖర్చుఅయ్యే పథకం ఒకటి సిద్ధపరచబడింది.

# హైదరాబాదులో భారీనీటి వసరుల ప్రాజెక్టు

## ౧౯౫౪--౫౫ లో జరిగిన కార్యప్రగతి

హైదరాబాదు రాష్ట్రంలో ప్రస్తుతం ఈక్రింది భారీ ప్రాజెక్టులపని జరుగుతున్నది :—

౧. తుంగభద్ర ప్రాజెక్టు నిర్మాణం.

౨. రాజోలీబండ డైవర్షన్ స్కీము నిర్మాణం.

౩. గోదావరి ఉత్తరకాలువ ప్రాజెక్టు నిర్మాణం.

౪. పర్భని జిల్లాలో పూర్ణా ప్రాజెక్టు ప్రాథమికనిర్మాణ కార్యాలు.

౫. నందికొండ ప్రాజెక్టు సమగ్రపరిశోధన

౬. ఇతర భారీఇర్రిగేషన్ ప్రాజెక్టుల పరిశోధనలు.

ఈ నిర్మాణాంశాఖలో ఒక ఛీఫ్ ఇంజనీరు, ముగ్గురు సూపరింటెండింగు ఇంజనీర్లు, ౧౨మంది డివిజనల్ ఇంజనీర్లు వున్నారు. పనుల పర్యవేక్షణకొరకై ఈక్రింది విధంగా మూడు సర్కిళ్లు పనిచేస్తున్నాయి.

| సర్కిల్ | పనులు |
|---|---|
| ౧. తుంగభద్రా రిజర్వాయురు సర్కిల్, మునీరాబాద్. | ౧. తుంగభద్ర రిజర్వాయురు పనులు.<br>౨. తుంగభద్ర కాలువపనులు, మొదటి అంచెనుంచి ౪౭ మైళ్లవరకు. |
| ౨. తుంగభద్రకాలువ సర్కిల్, యర్మరస్. | ౧. తుంగభద్రకాలువ పనులు ౪౭మైలునుంచి ఇంకాపైన<br>౨. రాజోలీబండ డైవర్షన్స్కీము. |
| ౩. గోదావరి ఉత్తర కాలువ ప్రాజెక్టు సర్కిల్, హైద్రాబాదు. | ౧. గోదావరి ఉత్తర కాలువ ప్రాజెక్టు, కడం ఆనకట్టు, కాలువ పనులు.<br>౨. పూర్ణా ప్రాజెక్టు ( ప్రాథమిక పనులు).<br>౩. నందికొండ ప్రాజెక్టు సమగ్రపరిశోధనలు<br>౪. ఇతర భారీ ఇర్రిగేషన్ ప్రాజెక్టుల పరిశోధనలు |

తుంగభద్ర రిజర్వాయురు నిర్మాణం పనులు పూర్తిఅయినవి కాబట్టి ఇప్పుడు కాలువల నిర్మాణంపని చురుకుగా సాగుతున్నది. కాలువ నిర్మాణాల విస్తృత కార్యక్రమాన్ని పనులు జరుపడానికీ, రిజర్వాయురు పనులపై ఏడాదికి రూ. ౬౦ నుంచి ౭౦ లక్షలవరకు ఇంతకుమునుపు ఖర్చుచేస్తున్నట్టి కొన్ని డివిజనులపై కార్యాభారాన్ని తగ్గించడానికి మరిరెండు డివిజనులు ఏర్పాటుచేయబడినవి.

రాజోలీబండ డైవర్షన్ స్కీము పనులను త్వరితగతిని అవులు జరుపడానికై ఇంతకు మునుపు రద్దుచేయుబడిన హెడ్‌వర్క్సు ఆనకట్టు డివిజను మళ్ళీ పునరుద్ధరించబడింది. ఈ డివిజను ౧౯౫౫ జనవరి ౧౭ తేదీనుంచి రాజోలీబండ డైవర్షన్‌స్కీము, డివిజన్ నెం. ౨ అను పేరుతో ఉప్పల్ ప్రధానకేంద్రంగా పనిచేయుటు నారంభించింది.

పూర్ణా ప్రాజెక్టు ప్రాథమిక పనులను జరుపడానికి, నందికొండప్రాజెక్టు సమగ్రపరిశోధనలు జరపడానికి ౧౯౫౪–౫౫ సంవత్సరపు చివరిభాగంలో ప్రభుత్వ మంజూరీ లభించింది. నందికొండ ప్రాజెక్టును హైదరాబాదు ఆంధ్ర ప్రభుత్వాలు ఉమ్మడిగా నిర్మించవలసివున్నది. హైదరాబాదు ప్రభుత్వం

ప్రారంభించిన నందికొండ ప్రాజెక్టు సమగ్ర పరిశోధనలో హైదరాబాదు రాష్ట్రంవైపున కాలువ నిర్మాణం ముఖ్యమైనది. ఇందుకొరకై రెండు క్రొత్తడివిజనులు ఒకటి పూర్ణాప్రాజెక్టు ప్రాథమిక పనులకు, రెండవది నందికొండ ప్రాజెక్టు పరిశోధనలకొరకు గతసంవత్సరం ఏర్పాటుచేయబడినవి.

తుంగభద్ర ప్రాజెక్టు:—

ఈప్రాజెక్టును హైదరాబాదు ప్రభుత్వం, అవిభక్త మద్రాసు ప్రభుత్వం (ప్రస్తుత ఆంధ్ర మైసూరు ప్రభుత్వాలు) నిర్మించ తలపెట్టినవి. ఇది ౧౯౪౫లో ప్రారంభించబడింది. రాయచూరు జిల్లాలోని మల్లాపురం గ్రామంవద్ద తుంగభద్ర నదికి ఆనకట్ట నిర్మించడం, ఆనకట్టకు రెండువైపులా రెండు కాలువలు నిర్మించడం, జలవిద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయడం, ఇది ఈస్కీములోని ముఖ్యాంశాలు. హైదరాబాదువైపు పనులకు అంటే (౧) ౨౯౩౭ అడుగులపొడవు రాతికట్టు, (౨) ౧౫౫౦ అడుగులపొడవు మిశ్రమ ఆనకట్ట, (౩) ౪౫౦ అడుగుల పొడవు మట్టికట్ట (౪) ఎడమవైపు ఒడ్డునుంచి ౩౧౦౦ క్యూసెక్కుల నీటి పరిమాణం తాహతుగల ౧౨౭ మైళ్ళ పొడవు కాలువ నిర్మాణంకొరకై ౧౯౫౧ జనవరిలో ప్రభుత్వం కల్దారు రూ. ౨౩౦౪ లక్షలు మంజూరుచేసింది. మొదట తయారుచేసిన స్కీములో ౪.౫ లక్షల ఎకరాలను సాగుబడికి తేవడమేగాక ౧.౩౫ లక్షల ఎకరాలలో అడవులు పెంచవలెననికూడా తలపెట్టబడింది. అయితే ఆతరువాత సాగుబడి ప్రమాణం ౫.౭ లక్షల ఎకరాలకు పెంచబడింది. నీటి పరిమాణాన్ని దృష్టిలో పెట్టుకొని ఈపెరుగుదల చేయబడింది. సవరించబడిన పైరుల స్కీములో వరి పండే ప్రాంతం ౯౨,౦౦౦ ఎకరాలనుంచి ౫౦,౦౦౦ ఎకరాలకు తగ్గించబడినప్పటికీ నీటి పారుదల ఇంకా హెచ్చుప్రాంతానికి విస్తృతికరింపబడి అధిక సంఖ్యాకులైన ప్రజలకు మేలుచేకూర్చగలదు. డామును నిర్మాణంపని దాదాపు పూర్తి అయినట్లే. అయితే వరదగేట్లు, కమ్యూనికేషన్ బ్రిడ్జి, ఆనకట్టపై రోడ్డుదారి ఇంకా ఇతర స్వల్ప పనులు పూర్తిచేయవలసివున్నవి.

౨౯వ మైలు వరకు పెద్దకాలువ త్రవ్వకంపూర్తిఅయింది. ఈకాలువనుంచి ౧౯౫౫ జనవరిలో ౧౬,౦౦౦ ఎకరాలకు సరిపోవునంత నీరు వదలబడింది. ఇందుకుగాను ౧౯౫౫ జూలై వరకు ౧౪,౬౦౦ ఎకరాల భూమి దున్ని సాగుబడికి తేబడింది. మిగతా ప్రాంతాన్నికూడా సాగుబడికి తేవడానికై భూమ్యాదాయశాఖ తగుచర్యలు గైకొంటున్నది. క్రాస్ డ్రైనేజి పనులు, పంట కాలువలు మొదలగు పనులతోపాటు, ౧౦౧ మైలువరకు కాలువ త్రవ్వకంపనికూడా సాగుతున్నది. పెద్ద కాలువకు ౪౧వ మైలువద్ద సోమనహాళవాగుపై ఆర్. సి. సి. ఫౌండేషనులతోసహా అక్విడక్టుకు నిర్మాణం జరుగుతున్నది. ఈ అక్విడక్టుకు $58' \times 7\frac{1}{2}'$ అడుగుల తూములు ౧౨ వున్నవి. దీనికి ఆర్.సి.సి. స్తంభములుకూడా వున్నవి. ఈ నిర్మాణానికి రూ. ౧౪.౮౮ లక్షలు ఖర్చు కాగలదని అంచనా వేయబడింది. తుంగభద్ర ప్రాజెక్టుకు మొత్తం ౧౨౭ మైళ్ల పొడవు కాలువ నిర్మాణం ౧౯౫౮ వరకు పూర్తికాగలదు.

ప్రథమ పంచవర్ష ప్రణాళికలో ఈప్రాజెక్టుకు రూ. ౧౬౦౯ లక్షలు ఏర్పాటుచేయబడింది. కాని ఖర్చు పెట్టబడిన మొత్తం ౧౩౬౮ లక్షలు, అంటే రూ. ౨౪౧ లక్షలు మిగిలిపోయాయి. ఆనకట్టఖర్చుకూడా రూ. ౨౪౦ లక్షలు పెరిగింది. ఈవిధంగా రెండవ పంచవర్ష ప్రణాళికకు ౭౩ లక్షల శేషవ్యయం కాగలదని ఆశించగా ఇప్పుడు మొత్తం ౨౪౧+ ౨౪౦+ ౭౩ = రూ. ౫౫౪ లక్షలు రెండవ పంచవర్ష ప్రణాళికలో శేషవ్యయంకాగలదు.

రాజోలిబండ డైవర్షన్ స్కీము :—

రాజోలిబండ ఆనకట్టపని ౧౯౪౭లో ప్రారంభింపబడింది. ఈ ఆనకట్ట పొడవు ౨౬౯౦ అడుగులు. తుంగభద్ర నీటిని ఉపయోగించుకునే విషయమై అవిభక్త మద్రాసు రాష్ట్రం హైదరాబాదురాష్ట్ర ప్రభుత్వాలమధ్య ఇందుకు ఒక ఒప్పందం జరిగింది. ఈస్కీముకు రూ. ౪౩౦ లక్షలు ఖర్చుకాగలవని అంచనావేయబడింది. దీనిని ప్రథమ పంచవర్ష ప్రణాళికలోనే పూర్తిచేయ్యాలని సంకల్పించబడింది. ౧౯౫౨వరకు ఆనకట్టలో సగంకంటె ఎక్కువభాగం శిఖరంవరకు పూర్తి అయింది. మిగతా సగం ఆనకట్ట ఆంధ్రరాష్ట్రంవైపున వున్నది. దాని పునాదుల నిర్మాణం పూర్తి అయింది. రాతి కట్టడంకూడా ౧౦౭౫౦౦ అడుగుల సగటు లెవల్‌వరకు అంటే శిఖరాగ్ర లెవల్ ౧౦౯౦ అడుగులకు ఇంకా ౧౫ అడుగుల తక్కువవరకు కట్టబడింది. ఉభయ రాష్ట్రాలమధ్యన జరుగవలసిన ఒప్పందం దృష్ట్యా ఈభాగం ఆనకట్టపై పని ఆగిపోయింది. దీని కాలువ పొడవు ౬౫ మైళ్ళు. దీనికిగాను ౪౮ మైళ్ల పొడవున కాలువపని సాగుతున్నది. ఈ కాలువలో మొదటి ౨౦ మైళ్ల భాగం నీటి పారుదలకు సిద్ధంగా వున్నది.

మొదటి పంచవర్ష ప్రణాళికలో ఈప్రాజెక్టుకు రూ. ౩౧౪ లక్షలు కేటాయించబడింది. దీనికిగాను మొత్తం ౨౨౫లక్షల వరకు ఖర్చుచేయబడింది. అంటే ౮౯ లక్షలు మిగిలిపోయాయన్న మాట. ఈ మిగిలిన మొత్తం రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడుతూంది.

## గోదావరి ఉత్తర కాలువ ప్రాజెక్టు :—

గోదావరి లోయ అభివృద్ధిస్కీములో ఈప్రాజెక్టు ఒకటి. గోదావరికి ఉపనది అయిన కడం నదికి ఆనకట్ట నిర్మించడం, ఆబీ తాబీ పంటలలో దాదాపు ౬౫వేల ఎకరాలను సాగుబడిచేసే ౪౫మైళ్ళ పొడవు కాలువ నిర్మించడం ఈప్రాజెక్టులో తల పెట్టబడిన కార్యక్రమం. దీనికి రూ. ౪౪౧ లక్షలు అంచనా మంజూరు చెయ్యబడింది. ఈప్రాజెక్టుయొక్క హెడ్‌వర్క్సు దాదాపు పూర్తి అయినవి. స్పిల్ వేసెక్షనులోను ఫ్లడ్ గేట్ల నిర్మాణంలోను ఇంకా కొంతపని మిగిలివున్నది. ఈపని ౧౯౫౬ ఆఖరువరకు పూర్తికాగలదు. ౧౯౫౫ జూలైలో పెద్దకాలువలోకి నీరు వదలబడింది. ఇంతవరకు ౨౦౦ ఎకరాలలో గట్లువేయడం పూర్తిఅయి ఈభూమి సాగుబడికి సిద్ధంగా వున్నది.

ప్రథమ పంచవర్ష ప్రణాళికలో ఈ ప్రాజెక్టుకు రూ. ౩౫౮ లక్షలు మంజూరు చేయబడింది. ఈమొత్తానికిగాను, ప్రథమ ప్రణాళిక ముగిసేలోపుగా ౩౧౯ లక్షలు ఖర్చు కాగలవు. అంటే ఇంకా రూ. ౩౯ లక్షలు మిగిలిపోతాయి. ఈమిలిగిన మొత్తాన్ని రెండవ ప్రణాలికలో చేర్చడమవుతుంది.

## పూర్ణా ప్రాజెక్టు

ఈ ప్రాజెక్టు పరిశోధనలు ౧౯౫౪లో పూర్తిచేయబడి దీనికి సంబంధించిన స్కీములు ప్లానింగు కమీషనుకు పంప బడినవి. హైదరాబాదులోను, ఢిల్లీలోను, చర్చలు జరిగిన తరువాత కేంద్రజలవిద్యుత్తు కమీషన్‌కు చెందిన ఉన్నతాధి కారులు ప్రాజెక్టు స్థలాన్ని సందర్శించారు. ప్రాజెక్టుయొక్క ఎస్టిమేటు కేంద్ర జలవిద్యుత్తు కమీషన్‌వారికి పంపబడింది. జలవిద్యుచ్ఛక్తిఉత్పత్తితోకూడా కలుపుకొని ఈ ప్రాజెక్టుకు రూ. ౨౦౫ లక్షలు ఖర్చుకాగలవని అంచెనా వేయబడింది.

ఈప్రాజెక్టుయొక్క ప్రాథమిక కార్యాలను ప్రారంభించ డానికై ౧౯౫౫ జనవరిలో ప్రభుత్వం రూ. ౪౦.౭౫ లక్షలు మంజూరుచేసింది. ప్రాథమిక కార్యాలలో క్యాంప్ బిల్డింగులు రోడ్ల నిర్మాణం, ప్రాజెక్టువరకు రోడ్డువేయడం, నీటి సర ఫరా ఏర్పాట్లు వున్నవి. ఈపనులు పూర్తి అయ్యాయంటే ప్రాజెక్టు ఎస్టిమేటు మంజూరు అయిన వెంటనే ఆనకట్ట నిర్మాణాన్ని ప్రారంభించవచ్చు. ఈ ప్రాజెక్టుక్రింద ౧,౫౫,౦౦౦ ఎకరాలు సాగుబడికాగలవని అంచెనా వేయబడింది. నీటి పారుదల జలవిద్యుచ్ఛక్తి ఉత్పత్తి, అభివృద్ధిపన్ను మొదలగు వాటిమూలంగా రూ. ౩౬,౩౩,౭౨౦ లు ఆదాయం రాగలదు అంటే పెట్టుబడి మొత్తం ౨౦౫ లక్షలుకుగాను నూటికి ౫.౧౫ వంతుల చొప్పున రాబడి వుంటుందన్నమాట. ప్రాథ మికపనులు గత సంవత్సరం మొదలు పెట్టబడ్డవి. ౧౯౫౫ మార్చివరకు ఈపనులపై రూ. ౩,౨౯,౭౨౩ లు ఖర్చుచేయ బడినవి. ప్రాథమిక పనులు ఇంకా కొనసాగుతున్నవి.

## నందికొండ ప్రాజెక్టు సర్వే

నందికొండ ప్రాజెక్టు హైదరాబాదు ఆంధ్ర ప్రభుత్వాల సమిష్టి ప్రాజెక్టు ఉభయప్రభుత్వాల చీఫ్ ఇంజనీర్ల అంతిమ ప్రతిపాదనలపై దాఖలుచేయవలసిన సంయుక్త నివేదిక ౧౯౫౪ లో భారత ప్రభుత్వానికి సమర్పించబడింది. ఈప్రాజె క్టుకు మొత్తం రూ. ౧౨౨ కోట్లు ఖర్చుకాగలదని అంచెనా వేయబడింది. ఇందులో హైదరాబాదు ప్రభుత్వభాగము రూ. ౩౨.౨౪ కోట్లు. హైదరాబాదువైపు కాలువ పరిశోధనలకొరకై ఒక సర్వే డివిజనును ఏర్పాటుచేయడానికై ఒక సర్వే డివిజనును ఏర్పాటు చేయవలసిందిగా ౧౯౫౫ ఫిబ్రవరిలో ప్రభుత్వ మంజూరీ లభించింది. ఇంతవరకు ఈపని చాలావరకు సాగింపబడింది. ఇంతవరకు ఇర వయ్యోమైలువరకు ఎస్టిమేటింగు పూర్తి అయింది. ప్రాజెక్టుపని ఆరంభించడానికి ముందు ఆనకట్ట స్థలంవరకు రోడ్డువేయడం అవసరం. దాదాపు రూ. ౧౨ లక్షల ఖర్చులో ఈరోడ్డును వేయడానికి గాను ఈసంవత్సరానికి రూ ౮ లక్షలను మంజూరుచేస్తూ ప్రభుత్వం ౧౯౫౫ జూన్‌లో మంజూరీ ఇచ్చింది. ఈపని ౧౯౫౫ జూన్‌లో నిర్మాతలకప్పగించబడింది.

గోదావరి ప్రాజెక్టుయొక్క రెండవదశకు సంబంధించిన పరిశోధనలు ఇప్పుడు జరుగుతున్నవి.

## తుంగభద్ర అభివృద్ధిపని

తుంగభద్ర సామాజికాభివృద్ధి బ్లాకులో పాలాలలో కాల వల నిర్మాణంపనిని పబ్లికువర్క్సుశాఖకు అప్పగిస్తూ ప్రభుత్వం

౧౯౫౫ మే నెలలో మంజూరీ ఇచ్చింది. ఇందుకొరకు రూ. ౧,౫౦,౦౦౦లు కేటాయించబడినవి. పబ్లికువర్క్సు శాఖకు ఈపనిని అప్పగించిన తరువాత ౫౦౯౯ ఎకరాల భూమిలో పంటకాలువలు వేయబడినవి. ఇంతవరకు ౧౪,౬౦౦ ఎకరాలు సాగుబడికి తేబడినవి. తుంగభద్ర ప్రాజెక్టు క్రింద ఆయకట్టను అభివృద్ధి పరచడానికై ఆయకట్టు ప్రాంతంలో దాదాపు ౨౫౦ మైళ్ల పొడవు రోడ్లు నిర్మించడానికై రాష్ట్ర డెవలప్‌మెంటు కమీషనర్ ఒక కార్యక్రమాన్ని నిర్ణయించారు. ఈపనినికూడా పబ్లికువర్క్సుశాఖకు అప్పగిస్తూ ౧౯౫౫ జూన్‌లో ప్రభుత్వంనుంచి మంజూరీ లభించింది. ఈపనులకు సంబంధించిన ప్లానులను, ఎస్టిమేట్లను తయారుచేసేటందుకై డెవలప్‌మెంటు కమీషనర్‌యొక్క కార్యక్రమాన్ని పంపవలసిందని కోరడమైనది.

స్వల్ప నీటివనరుల ప్రాజెక్టులు

౧౯౪౯—౫౦లో అయిదు ప్రాజెక్టులు ఆరంభింపబడినవి. ఆ అయిదు ఇవి :— ౧. కోయల్‌సాగర్, ౨. సరళాసాగర్, 3. భీమన్‌పల్లి, ౪. బెండుసురా, ౫. ఖాసాపూరు. ఇవి ఇంకా పది ప్రాజెక్టులు ప్రథమ పంచవర్షప్రణాళికలో చేర్చబడినవి. ఈ ౧౫ ప్రాజెక్టులకు రూ. ౪౧౪.౧౫ లక్షలు ఖర్చు అంచెనావేయబడింది. ఈప్రాజెక్టులక్రింద ౧౦3.౦౭ వేల ఎకరాలు సాగుబడికి రాగలవు.

ఈ ప్రాజెక్టులపై జరుగుతున్నపని, ఈనాటివరకు వీటిపై అయిన ఖర్చు, సాధింపబడిన ఫలితాలు ఈదిగువ చూపబడినవి.

౧. కోయిల్‌సాగర్ (మహబూబ్‌నగర్) :— దీనిఆనకట్ట పూర్తిఅయింది. కాలువలు ఉపకాలువల నిర్మాణం సాగుతున్నది. ఈప్రాజెక్టు ౯—౭—౧౯౫౪ తేదీన కేంద్ర ప్రభుత్వ ప్రస్తుత రక్షణశాఖామంత్రి డా. కట్జూ ప్రారంభోత్సవంచేశారు. పొలాలకు నీరుకూడా వదలబడింది. ఆబీపంటలో దాదాపు వెయ్యి ఎకరాలు సాగుబడి అయినవి.

౨. బెండుసుర ప్రాజెక్టు (బీడ్ జిల్లా) .— ప్రధానమైన ఆనకట్టపై పనిపూర్తి అయింది. సి.డి. వర్క్సు, కాలువల పని జరుగవలసిన వున్నవి. ఈప్రాజెక్టుకు ౧౭—౮—౧౯౫౪ తేదీన కేంద్రప్రభుత్వ డిప్యూటీ హోంమంత్రి ప్రారంభోత్సవం చేశారు. ఇంతవరకు 3,౦౦౦ ఎకరాలకు నీటిపారుదలజరిగింది.

3. ఖాసాపూరు ప్రాజెక్టు (ఉస్మానాబాదు జిల్లా) .— ఈప్రాజెక్టుపని చురుకుగా సాగుతున్నది. దీనికి ౧—౧౨—౧౯౫౪ తేదీన రాష్ట్ర ముఖ్యమంత్రి డాక్టరు బి. రామకృష్ణారావు గారు ప్రారంభోత్సవంచేశారు. వెయ్యి ఎకరాలకు నీరు వదలబడింది.

౪. భీమనపల్లి ప్రాజెక్టు (నల్లగొండజిల్లా) :— ఈ ప్రాజెక్టుపని పూర్తి కావస్తున్నది. పొలాలకు నీరు ఇదివరకే వదలబడింది. ౫౦౦ ఎకరాలు సాగుబడి అయినవి. కాలువలపని ఇంకా పూర్తికావలసివున్నది.

౫. సరళాసాగర్ ప్రాజెక్టు (మహబూబునగర్ జిల్లా) :— అనేక కారణాలవల్ల ఈప్రాజెక్టుపని అనుకొన్న ప్రకారం పూర్తిచేయడానికి వీలుపడలేదు. అయితే ఈ సంవత్సరం ప్రధానమైన ఆనకట్ట, స్పిల్‌వే, పంటకాలువ పనులు క్రమంగా సాగిపోతున్నవి.

(నిర్మాణకార్య క్రమాల జాబితా—ప్రక్క—పేజీలో)

---

(3౬వ పేజీ తరువాయి)

భూమిలో తేమ ఎక్కువ కావడం వల్లనూ, అట్టి ప్రాంతాల్లో పశువులను వెంటనే మేత మేయ నివ్వకుండా, అగ్ని మంటలు వేయబడకుండా, కఠినచర్యలు గైకొనడంవల్లనూ, వరదకట్టలకు మధ్య నుండు ప్రాంతాల్లో గడ్డి బాగుగా పెరిగింది. వరద కట్టలు పోసిన ప్రాంతాల్లో రెండవసంవత్సరంలో పచ్చిక ఉత్పత్తి బీదరులో ౨౭౫ శాతం, ఉస్మానాబాదులో ౨౮3 శాతం వరకు పెరిగింది.

భూములను భూసారం దృష్ట్యాను, నీటి తేమ దృష్ట్యాను వాటిని సక్రమంగా వినియోగించుటకు, వర్గీకరించి, సర్వే చేయడం చాలా ముఖ్యం. సువిశాలమగు భూములు వరదలకు భూసారం కొట్టుకొని పోవు ప్రమాదానికి గురి అవుతూ వున్నవి. ఇట్టి భూములు ఒక గ్రామంనుంచి మరొకగ్రామం వరకు కూడా వ్యాపించి యున్నవి. రాష్ట్రంలో ఇట్టి ప్రమాద ఫలితంగా మొత్తం మీద ౬3౪౭.౯3 చ. మై. ప్రాంతం, వివిధ రకాలుగా బీటలువారి బీడు పడియున్నది. ఇది యథాతథంగా ఉండే సంఖ్య కాదు. ప్రతి సంవత్సరం సేద్యయోగ్యమైన భూములు బీడు పడిపోవడంవల్ల, వాటి విస్తీర్ణం ఇంకనూ ఎక్కువ అవుతూన్నది.

వరద కట్టలు పోసి, నీటి వరదల ఉధృతాన్ని అరికట్టడం ద్వారా, భూమిలో తేమ నిలువ ఉండడం ఎక్కువవడమే గాక, ప్రత్యక్షంగాను, పరోక్షంగాను పరిసర వ్యవసాయ భూములలో పంట ఎక్కువ పండడమే గాక, అట్టి ప్రాంతాల్లో పచ్చిక కూడా విశేషంగా పెరుగుతుంది. భూమిలోపల నీటిమట్టం క్రమేణా పెరుగుతున్నది. నిజం చెప్పాలంటే ఒకప్పుడు ఏమీ పెరగకుండా బీడుపడిన భూములు ఎనిమిదేండ్ల స్వల్ప కాలంలోనే పచ్చ పచ్చగా కళకళలాడుతున్నాయి.

# నిర్మాణ కార్యక్రమాల జాబితా

| క్రమ సంఖ్య | ప్రాజెక్టుపేరు | జిల్లా | ఎసి మేటు మొత్తం. కల్దారు లక్షలలో | ఖర్చుచేయబడిన మొత్తం లక్షలలో | జరిగే నీటి పారుదల ఎకరాలలో | ఇంతవరకు సాధించ బడిన పారుదల ఎకరాలలో | విశేషాలు |
|---|---|---|---|---|---|---|---|
| ౧. | కోయిలసాగర్ | మహబూబునగర్ | ౮౫.౫౩ | ౭౭.౩౩ | ౧౨౦౦౦ | ౧౦౦౦ | పూర్తికావస్తున్నది |
| ౨. | ఖాసాపూరు | ఉస్మానాబాద్ | ౪౦.౦౦ | ౩౪.౪ | ౧౩౫౦౦ | ౧౦౦౦ | ,, |
| ౩. | బెందుసురా | బీడ్ | ౫౯.౦౦ | ౫౩.౪౧ | ౯౩౦౦ | ౩౦౦౦ | ,, |
| ౪. | భీమనపల్లి | నల్లగొండ | ౮.౩ | ౬.౯ | ౧౮౬౦ | ౫౦౦ | ,, |
| ౫. | సరళాసాగర్ | మహబూబునగర్ | ౨౧.౦౯ | ౯.౦ | ౪౮౦౦ | ... | పని జరుగుతున్నది. |
| | కొరత ప్రాంతాలలో పనులు | | | | | | |
| ౬. | మూసీ | నల్లగొండ | ౧౧౮.౧౪ | ౧౦.౯ | ౪౨౦౦౦ | ... | ఈ ప్రాజెక్టు ఈసంవత్సరమే ప్రారంభించ బడింది. ఒగి, గ్రావిటి కట్టపై పని జరుగుతున్నది. |
| ౭. | సిర్‌స్లా | నాందేడ్ | ౨.౨ | | ౩౦౦౦ | ౫౦౦ | ఈ ప్రాజెక్టు పని పూర్తికావస్తున్నది. పొలాలకు నీరుకూడా వదలబడుతున్నది. |
| ౮. | కామ్లా | బీడ్ | ౨౦.౦౦ | .. | ౨౬౩౦ | .. | పని ఇటీవలనే ప్రారంభమైనది |
| ౯. | తల్వార్ | బీడ్ | ౧౪.౦౦ | .. | ౩౦౦౦ | .. | ఈ ప్రాజెక్టుపై పని ఇటీవలనే ప్రారంభమైనది. |
| ౧౦. | షిల్‌నా ఆనకట్ట | ఔరంగాబాదు | ౧.౫ | .. | ౭౫౦ | .. | ,, |
| ౧౧. | ఢేకూ | ఔరంగాబాదు | ౨౪.౦౦ | .. | ౬౦౦౦ | .. | మంజూరీరావలసివున్నది |
| ౧౨. | జూయా | ఔరంగాబాదు | ౧౬.౦౦ | .. | ౪౦౦౦ | .. | ,, |
| ౧౩. | పూర్ణా ఆనకట్ట | ఔరంగాబాదు | ౦.౩౦ | .. | ౩౦౦ | .. | దాఖలు కావలసివున్నది. |
| ౧౪. | అంజన్ ఆనకట్ట | ఔరంగాబాదు | ౩.౭౫ | .. | ౫౦౦ | .. | ,, |
| ౧౫. | నల్దుర్గ్ | ఉస్మానాబాదు | ౦.౪౦ | .. | ౨౦౦ | .. | మంజూరీరావలసివున్నది. |

పై పనులే గాక ఈ క్రిందీ పనులు కూడా చేపట్టబడినవి :—

౧. తెగిపోయిన చెరువులకు మరమ్మతులు.

౨. మహబూబ్ నగర్ జిల్లాలో వరద నివారణకార్యాలు.

౩. కమ్యూనిటీ ప్రాజెక్టులు.

౪. బెనిఫిషియరీస్ స్కీము క్రింద ప్రజలు చేసిన సహాయం.

౫. రామప్ప, లక్నవరం, పాఖాల చెరువుల అభివృద్ధి.

౬. యస్. ఇ. యస్. బ్లాకులు.

౧. తెగిపోయిన చెరువుల మరమ్మతు :—హైదరాబాదు రాష్ట్రంలోని తెగిపోయిన చెరువుల మరమ్మతు కొరకై భారత ప్రభుత్వం పంచవర్ష ప్రణాళికక్రింద కల్దారు రూ. ౨౦౮.౦౦ లక్షలు ఋణం ఇవ్వడానికి అంగీకరించింది. ఈ డబ్బుతో ౧,౫౨,౦౦౦ ఎకరాలు ఆయకట్టుగల ౨,౩౮౭ చెరువులు మరమ్మతు చేయబడుతాయి. ఇంతవరకు ౭౪౯ చెరువుల మరమ్మత్తు పూర్తి అయింది. వీటి క్రిందగల ఆయకట్టు ౫౪,౭౯౩ ఎకరాలు.

౨. మహబూబ్‌నగర్ జిల్లాలో వరదనివారణ కార్యాలు:—౧౯౫౨ మే నెలలో గాలివానలోపాటు అధికవర్షాలు కురిసినప్పుడు మహబూబునగర్ జిల్లాలో ౧౦౨౯ చెరువులు తెగిపోయినవి. వీటిలో ౬౭౭ చెరువులక్రింద ఒక్కొక్కదానికి ౧౦ఎకరాలకు పైగా ఆయకట్టు వున్నది. పది ఎకరాలకంటే ఎక్కువ ఆయకట్టు గల చెరువుల మరమ్మతును పబ్లికు వర్క్సు శాఖ చేయిస్తున్నది. పది ఎకరాలకంటే తక్కువ ఆయకట్టుగల చెరువులను భూమ్యాదాయ శాఖ మరమ్మతు చేయిస్తుంది. అయితే అవాంతర పరిస్థితి వచ్చినందువల్ల భూమ్యాదాయ శాఖయే ౧౯౫౨లో ౧౪౯ చెరువులను మరమ్మతు చేయించింది. వీటిక్రింద ౪౨౧౪ ఎకరాల ఆయకట్టు వున్నది. మిగిలిన ౫౨౮ చెరువుల మరమ్మతుకు పబ్లికు వర్క్సుశాఖ పూనుకొన్నది. వీటి క్రింద ౩౮,౦౨౩ ఎకరాల ఆయకట్టు వున్నది. ఇంతవరకు ౨౦,౨౦౮ ఎకరాల ఆయకట్టు వున్నట్టి ౨౪౯ చెరువులు మరమ్మతు చేయబడినవి. ఇంకా ౧౭,౮౨౫ ఎకరాల ఆయకట్టుగల ౧౭౯ చెరువుల మరమ్మతు జరుగవలసి యున్నది.

౩. కమ్యూనిటీ ప్రాజెక్టులు :—భారత ప్రభుత్వం ప్రారంభించిన ఈ స్కీముక్రింద మూడు కమ్యూనిటీ ప్రాజెక్టులు చేపట్టబడినవి.

ఎ. నిజామాబాదు జిల్లాలో నిజాంసాగర్ కమ్యూనిటీ ప్రాజెక్టు :—ఈ కమ్యూనిటీ ప్రాజెక్టులో బాన్సువాడా, బోధన్, నిజామాబాదు తాలూకాలలో ౫౪ చెరువులు, నిజాంసాగర్ ప్రాజెక్టు పంట కాలువల రిమోడలింగు పని ప్రారంభించ బడింది. వీటిక్రింద మొత్తం ౩౯,౪౨౮ ఎకరాల ఆయకట్టు వున్నది. ఈ పనులకు మొత్తం రూ. ౧౦,౧౫,౮౦౩ లు ఖర్చు కాగలవు. పనులు జరుగుతున్నవి.

బి. ములుగు కమ్యూనిటీ ప్రాజెక్టు, వరంగలు :—ఈ కమ్యూనిటీ ప్రాజెక్టులో ౧౪౬౫ ఎకరాల ఆయకట్టు గల ౫౯ చెరువుల పని ప్రారంభింపబడినది. వీటికి రూ. ౧,౭౨,౫౦౦ లు ఖర్చు కాగలవు.

సి. కమ్యూనిటీ ప్రాజెక్టు, బీడ్ :—ఈ కమ్యూనిటీ ప్రాజెక్టులోమూడు ఆనకట్టల పని ప్రారంభించబడినది. వీటి క్రింద ౩౧౮ ఎకరాల సాగుబడి అవుతాయి. ఈ మూడు ఆనకట్టలకు రూ. ౩౮,౪౧౫లు ఖర్చు కాగలవు.

౪. బెనిఫిషియరీ స్కీము క్రింద ప్రజలు చేసిన సహాయం :—ధనలోపంచేత ప్రభుత్వం ప్రారంభించకుండా వున్నట్టి నీటి పారుదల పనులకు మరమ్మతు పనులకు అయ్యే ఖర్చులో కొంతభాగాన్ని విరాళంగా ఇవ్వడానికి ప్రజలే ముందుకొస్తున్నారు. ఈ పనులకొరకై ప్రభుత్వం రూ. ౫ లక్షలు కేటాయించింది. ఈ స్కీముక్రింద నల్లగొండ, వరంగలు, ఖమ్మం మెదకు జిల్లాలలో ౩౪ పనులను ప్రారంభించడానికి ఏ పెట్టబడింది. వీటిలో ౧౮ పనులు జరుగు తున్నవి.

౫. కోయలపునరావాసం :—ఈ క్రింది స్కీములప్రకారం కోయలకు పునరావాసం కల్పించడానికై లక్నవరం, రామప్ప పాఖాలు చెరువుల అభివృద్ధిపని ప్రారంభించ బడింది :—

అ. స్వల్పకాలిక కార్యక్రమం. ఆ. దీర్ఘకాలిక కార్యక్రమం స్వల్పకాలిక కార్యక్రమం క్రింద చేపట్టబడిన పనులు పూర్తిఅయినవి. దీర్ఘకాలిక కార్యక్రమంలో పెద్ద కాలువల పునర్నిర్మాణం, ఆయకట్టు రోడ్ల అభివృద్ధి పనులు కలవు ఈ పనులు చురుకుగా సాగుతున్నవి.

౬. జాతీయ వికాస కేంద్రాలు :—ఈ స్కీముక్రింద మన రాష్ట్రానికి ఇంతవరకు ౩౧ బ్లాకులు కేటాయింపబడినవి వీటి పనులు కూడా చురుకుగా సాగుతున్నవి.

(౫౪—వ పుట చూడుడు)

# గ్రామీణ పరపతికి రూ. ౨౫ కోట్లు

## ప్రైవేటు ఋణదాతలను తొలగించుటకై పథకం



ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో గ్రామీణ పరపతి సౌకర్యాలను విస్తృత పరచుటకై రూ. ౨౫ కోట్లు ప్రత్యేకించ బడినవి. సహకార సంఘాల సభ్యత్వం ౧.౫ లక్షల నుంచి ౭.౫ లక్షల వరకు పెంచబడుతుంది. ప్రైవేటు ఋణదాతలను తొలగించి, వారిస్థానే సులభమైన షరతులపై అప్పిచ్చు సహకార సంస్థలను ఏర్పాటుచేయుటకు ఈ పథకం తలపెట్టబడింది.

రచన—యం. యస్. హనుమంతరావు.

దేశంలో వ్యవసాయదారుల ప్రస్తుత పరిస్థితులను గూర్చి అఖిల భారత గ్రామీణ పరపతి విచారణ సంఘం తన నివేది కలో కొన్ని ముఖ్యాంశాలను వెల్లడించింది. అవసరమైన వ్యవసాయదారులకు అప్పులిచ్చే కార్యక్రమాన్ని నిర్వహిస్తున్న ప్రభుత్వం మరియు సహకార ఏజన్సీలు ౬.౪ శాతం మందికి మాత్రమే సహాయపడగలుగుతున్నవి. మిగిలిన విశేష రైతాం గానికి ప్రైవేటు ఋణదాతలే అప్పులిస్తున్నారు. అందుకని ప్రభుత్వ సహాయంలో, సహకార సంఘాల ద్వారా గ్రామీణ పరపతి సౌకర్యాలను అభివృద్ధి పరచుటకై విచారణ సంఘం కొన్ని సిఫారసులు చేసింది.

### గ్రామీణ పరపతి విస్తృతీకరణ

హైదరాబాదు రాష్ట్రంలో ౧.౫ లక్షల మంది సభ్యత్వంతో ౪,౮౦౦ గ్రామపరపతి సంఘాలు పనిచేస్తున్నవి. ప్రస్తుతం ఈ సభ్యులకు డబ్బు కోటి రూపాయలకంటె ఎక్కువగా పంచిపెట్టబడడం లేదు. ౧౯౫౫–౫౬ అంతమయ్యే సరికి ఈ మొత్తం రూ. 1½ కోట్ల వరకు పెంచబడుతుంది. ఇది కూడా అసలు పరిస్థితిని ఆదుకోజాలదు. అందుకని వచ్చే ౫ ఏండ్ల కొరకు రూ. ౨౪ కోట్లు ఖర్చుగల సమగ్రమైన పథకం ఒకటి తయారుచేయబడింది. దీని ఫలితంగా భారీ యెత్తున ౯౫౮ బహుళార్థ సాధక పరపతి సంఘాలు స్థాపించబడుతాయి. ఇవన్నీ అనుభవం, యోగ్యతగల ఉద్యోగ సిబ్బందిచే నిర్వహించ బడుతాయి. వారికి జీతాలు కూడా ఇవ్వబడుతాయి. ఈ సంఘాల సభ్యత్వం ౭.౫ లక్షల వరకు పెంచబడుతుంది.

ఈ ప్రణాళికలోగల మరొక ముఖ్య విషయమేమంటే గ్రామీణ పరపతి, మార్కెటింగ్ కార్యకలాపాలలో కలుపబడు తుంది. ప్రస్తుతం ఉన్న టాకాలు, సహకార విక్రయశాలలు, బహుళార్థ సాధక సహకార సంఘాలను మార్చడం ద్వారా సుమారు ౪౯ మార్కెటింగ్ సహకార సంఘాలు ఏర్పాటు చేయబడుతాయి. సభ్యులందరూ తమ ఉత్పత్తులను విక్ర యించుటకుగాను వాటిని ఈ మార్కెటింగ్ సంఘాలకు తీసు కొనిరావడం వారి విద్యుక్త ధర్మమై ఉంటుంది. ఈ సం ఘాలు ఉత్పత్తులను విక్రయించి, సభ్యులకు రావలసిన డబ్బును బ్యాంకులలో జమకడుతాయి. వచ్చే పంటలను చూచుకొని, వాటిని హామీగా పెట్టుకొని వ్యవసాయదారులకు అప్పులివ్వ బడుతాయి.

### స్వల్పకాలిక, మధ్యరకం పరపతులు.

వ్యవసాయదారుల స్వల్పకాలిక అవసరాలను తీర్చుటకుగాను రెండవ పంచవర్ష ప్రణాళికలో రూ. ౧౦ కోట్లు ప్రత్యేకించ బడినవి. ఈ స్వల్పకాలిక ఋణములు ఒక సంవత్సరంలోపల చెల్లించబడుతాయి. ప్రస్తుతానికి నూటికి రూ. ౭–౧౩–౦ ల చొప్పున వడ్డీ వసూలు చేయబడుతుంది.

ఇదే విధంగా మధ్యరకం అప్పులు మూడేండ్లలోపల చెల్లించ బడుతాయి. వీటి కొరకు ఈ సంవత్సరానికి రూ. ౧౫ లక్షల ప్రత్యేకించబడినవి. వచ్చే పంచవర్ష ప్రణాళిక కాలంలో ఈ మొత్తం రూ. ౨ కోట్ల వరకు పెంచబడుతుంది. ఎద్దులు, వ్యవసాయ పరికరములు కొనడం, పడావా భూములను సాగు క్రిందికి తేవడం మున్నగువాటికయ్యే ఖర్చును భరించగలందులకు గాను రైతులకు ప్రత్యేకంగా ఈ డబ్బు అప్పుగా ఇవ్వబడుతుంది.

(౫౪వ పుట చూడుడు)

# హైదరాబాదు రాష్ట్రంలో

## వరి, మొక్కజొన్న పైరుల అభివృద్ధి

యం. యస్. పావార్ బి. ఎగ్., యం. యస్ (కార్నెల్)

( హైదరాబాదు ప్రభుత్వ వరిపైరు నిపుణుడు )

భారతదేశం మొత్తంలో వరిపైరు విస్తీర్ణంలోను, వరి ఉత్పత్తిలోను హైదరాబాదు రాష్ట్రం నూటికి ౨ వంతుల వాటా కలిగి వున్నది. ప్రాముఖ్యతను బట్టి రాష్ట్రంలో ఇది రెండవ పైరు. ఆహారరీత్యా వరిపైరు పై దాదాపు ౮౦ లక్షల మంది ప్రజలు ఆధారపడి వున్నారు. ౧౯౫౪ లో ఈ రాష్ట్రంలో ౬౦ వేలు మొదలు ౭౦ వేల టన్నుల వడ్ల కొరత వుండేది. కాని ఇప్పుడు మన రాష్ట్రం వడ్ల విషయంలో స్వయం సమృద్ధం కావడమేగాక దాదాపు ౨౦,౦౦౦ టన్నుల బియ్యం ఎగుమతి కూడా జరుగుతున్నది.

దాదాపు ౧౭ రకముల వరి విత్తనాల పంపిణీ ద్వారా రాష్ట్రంలో స్వయం సమృద్ధత కొంతవరకు సాధింపబడింది. ఈ రకాలు వ్యవసాయదారునికేగాక మిల్లు యజమానికి వ్యాపారస్తునికి, వినిమయదారునికి తగివున్నది. రాష్ట్రంలో వరిపైరు వేయబడే ప్రాంతంలో దాదాపు నూటికి ౨౭ వంతుల భూమిలో అంటే 14½ లక్షల ఎకరాల వరిపైరు భూమికిగాను ౪ లక్షల ఎకరాలలో మేలురకం వరి విత్తనాలు వేయబడుతున్నట్లు అంచెనాలు తెలుపుతున్నవి.

ఈ మేలురకం విత్తనాలవల్ల స్థానిక రకముల కంటె సగటున నూటికి పది మొదలు పదిహేను వంతుల చొప్పున ఎక్కువ పంట పండుతుంది. అయితే బాగా వ్యాప్తిలోవున్న హెచ్. ఆర్ ౧౯ రకంవల్ల ఒక సందర్భంలో ఎకరానికి ౧౦,౩౦౦ పౌనుల పంట పండింది.

బాగా ఎరువు వేసినట్లయితే ధాన్యంకంటె గడ్డి ఎక్కువ ఉత్పత్తి అవుతుంది. ధాన్యంరాలి పోతుంది. ఎరువులవల్ల కలిగే ఈ లోపాన్ని సరిజేయడానికై హైదరాబాదు రాష్ట్రంలో అంతర్జాతీయ హైబ్రిడేజేషన్ ప్రాజెక్టులో పాల్గొన్నది. ఈ ప్రాజెక్టును ఐక్యరాజ్య సమితి యొక్క ఆహార వ్యవసాయ సంస్థ, మరియు అంతర్జాతీయ రైస్ కమీషన్ సభ్యదేశాలు సంయుక్తంగా నిర్వహిస్తున్నవి. సభ్య దేశాలలో భారతదేశం కూడా వున్నది. ఈ ప్రాజెక్టులో ఏడు హైదరాబాదు రకాలు జపాను రకాలతో సమ్మేళన చేయబడి ఒక కొత్తరకం వరిని సృష్టించడం జరిగింది. ఇంతవరకు చేకూరిన ఫలితాలనుబట్టి ఇండియా జపాన్ రకాల కలయికవల్ల ఎరువులను ఉపయోగించినట్లయితే ధాన్యం రాలిపోకుండా ప్రయోజనం చేకూరుతుంది. అయితే ఈ కలయిక రకాలు అన్నం వండితే ఎలావుంటాయో ఇంకా పరిశోధించవలసి వున్నది. ఎందుకంటే జపాన్ దేశపు బియ్యం జిగటగా వుంటాయి. మరి భారత దేశీయుల రుచికి ఇవి అనుగుణంగా వుంటాయో లేదో!

దేశంలోని వరి రకాలవల్ల సంపూర్ణంగా లాభం పొందడానికై భారతదేశ రాష్ట్రాలనుంచి ౨౪౦ మేలు రకాలను, ఇండోనేషియా, సిలోన్, జపాను, చైనా, ఈజిప్టు, అమెరికా మున్నగు విదేశాలనుంచి ౧౧౮ మేలు రకాలను తెచ్చి ఈ రాష్ట్రంలోని నాలుగు వరి పెంపక కేంద్రాలలో ప్రయోగాలు చేయడమవుతున్నది. ఇంతవరకు ఇండోనేషియా, సిలోను రకాలు ఇతర దేశాలకంటె మంచి ఫలితాల నిచ్చేవిగా కనిపిస్తున్నవి.

### రెండవ పంట నారుమళ్లు పెంచడానికిమేలు రకం పద్ధతి

హైదరాబాదులో రెండవ పంటకాలంలో వరినారు మళ్లు తయారు కావడానికి ఆరేడు వారాలు పట్టుతుంది. కాని మొదటి పంటకాలంలో మూడు నాలుగు వారాలు చాలు.

దీనికి కారణం నవంబరు—జనవరి నెలల్లో ఉష్ణోగ్రత తక్కువగా అంటే ౫౩ డిగ్రీలు మాత్రమే వుంటుంది. చలిపరిమితి ప్రతి బంధకాన్ని అధిగమించడానికై నారుమడిపై ప్లాస్టిక్ గుడ్డ కప్పబడింది. ఫలిత మేమిటంటే విత్తనాలు వేసిన ౧౫ రోజులలోనే మొక్కలు తయారయ్యాయి. అలా ప్లాస్టిక్ గుడ్డ కప్పకుండా విత్తనాలు వేస్తే మొక్కలు ఎదగడానికి ౪౨ రోజులు పట్టాయి. అంతేగాక ప్లాస్టిక్ గుడ్డ కప్పులో పెంచబడ్డ మొక్కలవల్ల ఎకరానికి ౨,౯౦౬ పౌనుల ధాన్యం, ౫,౭౪౦ పౌనుల గడ్డి ఉత్పత్తి అయ్యాయి. అది లేకుండా పెంచిన వాటివల్ల ఎకరానికి ౨,౧౬౪ పౌనుల ధాన్యం, 3,౮౦౯ పౌనుల గడ్డి ఉత్పత్తి అయ్యాయి. అంటే అలా గుడ్డ కప్పడంవల్ల నూటికి 3౪ వంతుల చొప్పున హెచ్చు ధాన్యం నూటికి ౫౧ వంతుల చొప్పున హెచ్చుగా గడ్డి ఉత్పత్తి అయ్యాయి. అంటే ఎకరానికి రూ. ౪౦ లాభం కలిగింది. ఈ విషయంలో ఇంకా ప్రయోగాలు చెయ్యాలని తలపెట్టబడింది.

### నేల కుళ్లగించడం

జపాన్ పద్ధతి వరి సేద్యం మళ్లీ నారునాటే ప్రాంతాలకే తగివుంటుంది. అటువంటి ప్రాంతం రాష్ట్రి మొత్తం ప్రాంతంలో మూడోవంతు వున్నది. ఇలా వరిపండే ప్రాంతంలో అధిక ప్రాంతం జపాను పద్ధతివల్ల పూర్తిగా లాభం పొందలేక పోతున్నది. ఈ లోపాన్ని సరిదిద్దడానికై మొలకెత్తిన విత్తనాలను, నేలను చేతిలో కుళ్లగించి పెట్టడమైనది. జపాను పద్ధతి వరుస ప్రకారం నాటును ప్రోత్సహించుటకే ఈ విధంగా చేయడమైనది. దీని ఫలితాలు చాలా బాగా వున్నవి. ఈ కుళ్ళగించే పద్ధతికి వేరే యంత్రసామగ్రి ఇంకా ప్రావీణ్యం అక్కరలేదు. పైగా ఎకరానికి రూ. ౯౭ల నికరాదాయం లభించింది. మరొక విషయమేమంటే సాధారణంగా ఉపయోగించే విత్తనాలలో మూడింట రెండు వంతుల విత్తనాలు మిగులుతాయి. ఈపద్ధతి ఇంకా విశేషంగా పరిశీలింపబడుతున్నది.

### పేసంగి పంట

స్థానిక పేసంగిపంట రకాలను పరిశీలించగా అస్సాం, బెంగాలు, హైదరాబాదు ప్రాంతాలకు చెందిన కొతరస్వళ్లు, అశ్విని కార్తె వడ్లు, ఓమగౌడలు మొదలగు ఎనిమిది రకాలకంటె ఇవే మేలు రకమైనవని తెలిసినది. ఈ విషయంలో ఇంకా పరిశోధన జరుగుతున్నది.

### విత్తనాలు వేసే తరుణం

పరిశోధనలు సల్పగా ఆలస్యంగా వేసే రకాలకు మే నెల రెండవ పక్షం సరియైనదని, మధ్యరకాలకు జూన్ నెల సరియైన తరుణమని, ముందుగా వేసే రకాలకు జూలైవరకు తగు సమయమేనని తెలిసినది.

రాష్ట్రింలోని వరిపండే ప్రాంతాన్ని పరిశీలన చేయగా వివిధ రకం పైరుల స్వభావాలు, వివిధ సేద్య పద్ధతులను గూర్చి అమూల్యమైన వివరాలు తెలిసినవి. ఈ సమాచారం అధికోత్పత్తికై అనుసరింపబడే విధానాలను రూపొందించడానికి ఉపయోగించుకో బడుతుంది. సేద్య పద్ధతులను క్షుణ్ణంగా పరిశీలించగా ఒక్కొక్క యూనిటులో పంట దిగుబడి క్రమేణీ హెచ్చుతున్నట్లు, రైతులు కూడా తక్కువ ఖర్చులో ఎక్కువ ఉత్పత్తిని సాధించడానికై అభివృద్ధి కరమైన సేద్య విధానాలను అవలంబిస్తున్నట్లు తెలిసినది.

### జపాన్ పద్ధతి వరిసేద్యం

రాష్ట్రింలోని దాదాపు రెండు లక్షల ఎకరాలలో జపాను పద్ధతి వరిసేద్యం అవలంబింపబడడంవల్ల, చక్కని ఫలితాలు కలిగాయి. రెండేండ్ల లోపలనే ఈ పద్ధతి రాష్ట్రింలోని వరిపండే ప్రాంతాల రైతుల ఆదరాభిమానాలను చూరగొన్నది.

### వచ్చి ఎరువులు

వ్యవసాయోత్పత్తి ధరలు పడిపోవడంవల్ల, ఎరువులను కొనడానికి రైతులు వెనుక ముందాడు తున్నారు. ఈ పరిస్థితిని ఎదుర్కోవడానికై దాదాపు ౫౬ రకాల వచ్చి ఎరువులు స్వదేశీ రకాలు విదేశీరకాలు పరిశోధింప బడుతున్నవి. ముఖ్యంగా రెండు రకాలు విరివిగా పంచిపెట్ట బడుతున్నవి.

### మొక్క జొన్న

మన రాష్ట్రింలో మొక్కజొన్న అల్పాహారంగా ఉపయోగించ బడుతుంది. దాదాపు ౪ లక్షల ఎకరాలలో మొక్కజొన్న పండించబడుతుంది. ఖరీఫ్, రబ్బీ రెండు పంటలలోను ఇది పండించబడుతుంది. అయితే ఖరీఫ్ పంటలో రబ్బీపంట తొమ్మిదో భాగం మాత్రమే మన రాష్ట్రింలో సగటున ఎకరానికి ౯౦౦ పౌనుల పంట పండుతుంది. గత ఐదేండ్లలో అనేకస్వదేశీ విదేశీ రకాల పంటలు పరీక్ష చేయబడినవి. ఆ పరీక్ష ఫలింతగా మూడు మేలు తరమైన మొక్కజొన్న రకాల ఎన్నిక చేయబడినవి. ఈ మూడింటిలో ఉత్తమమైన రకం [illegible]గా విలవచేయబడింది. ఈ రకం వచ్చే రబ్బీపంట సమయంలో దాదాపు ౨,౦౦౦ ఎకరాలకు సరిపోయ్యేటట్లుగా పంపిణీ చేయబడగలదు.

---

# నిర్బంధంగా కమతాల ఏకీకరణ

## నాలుగు జిల్లాలలో పని ప్రారంభము

### ఈ పథకానికి సాలీనా ౩౧/౨ లక్షల ఖర్చు

(రాష్ట్రంలో అక్కడక్కడా చెదిరి ఉన్న భూకమతాలను ఏకీకరణం చేయాలని హైద్రాబాదు ప్రభుత్వం
నియమించిన ల్యాండు కమీషన్ సిపారసు చేసింది. ఈ పని మొట్టమొదట కరీంనగరు, నిజామాబాదు, బీడు, గుల్బర్గా
జిల్లాల్లో కరీంనగరు లేక సిద్ధిపేట, బాన్సువాడా లేక బోధన్, బీడు, యాదగిరి తాలూకాల్లో ఆరంభం చేయాలని కూడా
ఈ కమీషన్ సూచించింది. ఈ సిఫారసులను అమలు పరచ గలందులకై ౧౯౫౮ సం. హైద్రాబాదు కౌల్దారీ వ్యవసాయ
భూముల సవరణ చట్టం తదనుగుణంగా సవరించబడుతుంది.

కన్సాలిడేషన్ డైరెక్టరు అధ్వర్యాన ప్రతి జిల్లాకు ఒక్కొక్కటి చొప్పున ఈ నాలుగు జిల్లాల్లో ఏకీకరణ
సంఘాలు పనిచేస్తాయి. ప్రతి సంఘం ఒక కన్సాలిడేషన్ ఆఫీసరు, ఇద్దరు నాయబ్ తహశిల్దార్లు, ౧౨ మంది ఇన్స్పె
క్టర్లు, గుమాస్తాలు ఇతర సిబ్బంది ఉద్యోగులతో కూడి వుంటుంది. ఈ పథకానికి సాలీనా నికరం రూ. 3 ౧/౨
లక్షలు ఖర్చుకాగలవని అంచనావేయబడింది.

ఈ వ్యాసంలో ల్యాండు కమీషన్ రిపోర్టులోని విశేషాంశాలు దాని సిఫారసులు క్లుప్తంగా తిరిగి ప్రకటించబడుతున్నవి. ఈ
పథకం వల్ల ౮౦ శతి భూకామందులు లాభం పొందగలరని, కమీషన్ అంచనావేసింది.)

<u>చిన్న చిన్న కమతాలు</u>

భారత దేశం చిన్న రైతులతో కూడివున్న దేశం. వీరిలో
చాలామందికి ఆర్థికంగా లాభసాటి లేని కమతాలున్నాయి.
చిన్న వ్యవసాయ భూములు రైతులకేగాక వారి పశువులకు గూడా
పూర్తిగా పని కల్పించడంలేదు. అందువల్ల ఖర్చులెక్కుపై
లాభం తక్కువగా ఉండడం వల్ల వారి సేద్యం లాభదాయ
కంగా లేదు. రైతు జీవనోపాధి కొరకు సాధారణంగా బండితోలే
వానిగానో కూలీగానో పనిచేయుటకు, ఇతర వృత్తులను
అవలంబిస్తాడు. వారసత్వపు చట్టాలఫలితంగా, ఒక్కొక్క
తరం దాటేకొలది భూమి క్రమేణా చిన్నచిన్న భాగాలుగా
విభజింపబడి, ప్రతిసారి ఆస్తి మారకం జరగడం వల్లనూ వాటి
పై ఏలాటి నిర్బంధాలు లేక పోవడం వల్లనూ భూములన్ని
ఆర్థికంగా లాభసాటికాని కమతాలుగా ఏర్పడుతాయి. ప్రతి
వారసుడు ప్రతి భూమి రకంలో ఒక భాగం రావాలని
పట్టుపట్టడం వల్ల భూములు చిన్నచిన్న ముక్కలుగా విభ
జింపబడు తున్నాయి. వీటి దుష్పరిణామాలు తీవ్ర రూపం
దాల్చుతాయి. నీటి వనరుల క్రింద ఉండు భూమి, పచ్చిక
భూమి, ప్రత్యేకంగా ఖరీపు, రబ్బీ మున్నగు పంటలు పండు
భూమి, ప్రతిదానిలో కూడా తనకు భాగం రావాలని అతను
తలుస్తాడు. ఒకే గ్రామంలో రెండు మూడు రకాల భూము
లున్న చోట్ల, ఇర్రిగేషన్ పరిమితమై ఉన్న చోట్ల, అక్కడి
నైసర్గిక భౌగోళిక పరిస్థితులను బట్టి, కమతాలు ఈ విధంగా
విభజన కావడం కొంతవరకు వాంఛనీయమే. భూకామందు
కు పంటలు మార్చి పండించుటకు అవకాశముండాలి. తనకు,
తన పశువులకు సంవత్సరం పొడుగునా పని ఉండేట్లు అతను
చూసుకోవాలి. వివిధ పంటలు పండిస్తే ఒక సంవత్సరంలో
ఒక పంటగాని భూమికాని చెడిపోయినా, అంత నష్టం ఉండదు.
కనుక అతను కేవలం ఒకే ఒక పంటపైన గాని లేక ఒకే భూమి
పైన గాని ఆధారపడి ఉండలేడు. అయితే దురదృష్టవశాత్తు,
నైసర్గిక పరిస్థితులు అనుకూలంగా లేకపోయినా కూడా ఈ
విభజన పద్ధతి విపరీతమవు తున్నది. తత్ఫలితంగా ఈ రోజు
వ్యవసాయ కమతాలు, చిన్నవైనా, పెద్దవైనా అన్ని విధాలుగా

చిన్నచిన్న తునకలుగా విభజింపబడడమేగాక, అవి ఒక దాని కొకటి చాలా దూరంలో కూడా ఉన్నాయి.

వీటి దుష్పరిణామాలు తేటతెల్లమే. భూమి ఇక్కడకొంత అక్కడకొంత ఉంటే సేద్యం చేయడం కష్టం. ఒక భూమి నుంచి ఇంకోభూమికి పోవడానికిని కాలం, శ్రమవృథా అవుతున్నాయి. పంటల రక్షణ, సేద్యం పర్యవేక్షణ చేయడం ఖర్చుతో కూడిన పని. పైగా సమర్థత కూడా తగ్గిపోతుంది. కట్టలు, సరిహద్దులు వేయడం, రైతులు, పశువులు పోవుటకు దారివేయడం, వీటికి కూడా చాలా భూమి వృథాఅయిపోతుంది. భూమి యొక్క ఉపయోగం దృష్టితో కాకుండా అదే భూమిలో సమానభాగాలు ఉండాలనే పద్ధతి పైన అది విభజింపబడడం వల్ల వ్యక్తిగత ప్లాట్ల ఆకారం తరచుగా అనుకూలంగాలేదు. కనుక చాలా భూమి కోణాలుగా ఏర్పడడం వల్ల కూడా వృథా అవుతున్నది. కొన్ని సందర్భాలలో నాగలి మలుపుకొనే వీలు కూడా ఉండదు. పొలం సరిహద్దులు, దారుల విషయమై వివాదాలు, వ్యాజ్యాలు ఎక్కువై హానికర పరిస్థితికి వస్తున్నవి. ఇట్టి పరిస్థితులలో భూమిని అభివృద్ధి చేయడం సాధ్యం కాని పని అవుతున్నది. కనుక కమతాలు చిన్నచిన్న ముక్కలుగా విభజన కావడం యీరోజు దేశ వ్యవసాయాభివృద్ధికి పెద్ద అవరోధంగావున్నది.

కమతాల ఏకీకరణ

ఇకముందు భూములు యీ విధంగా విభజన కావడాన్ని చట్టరీత్యా నిషేధించి,అక్కడక్కడా చెదరి పడివున్న కమతాల ప్లాటును ఒకరి కొకరు మార్చుకోవడం వల్లకాని, కమతాలను ఏకీకరణ చేయుటకు తగు చర్యలు సూచింపబడినవి. ఈ పద్ధతి యీ క్రింద పేర్కొనబడినది :—

౧ మొదలు, భూమిలో నేటివరకు గల హక్కుల దస్తావేజు తయారుచేయబడుతుంది.

౨. అందరూ అంగీకరించిన స్థానిక స్థాయిల ప్రకారం భూమి ప్లాట్లు అన్నిటికీ విలువ కట్టబడతుంది.

3. ఆతరువాత ప్రతి కమతాన్ని ఇతర దానితో పోల్చి దాని విలువ కట్టబడుతుంది. ప్లాటును మార్చుకోవడం కాని లేక అందరికీ అంగీకారయోగ్యమైన నిర్దిష్ట సూత్రముల ప్రకారం భూమిని పునః పంపిణిచేయుటకు గాని, ఒక పథకం తయారుచేయబడుతుంది.

౪. అంతిమంగా ఈ పథకమును అమలు పరచడం, ప్లాట్లను పరస్పరం మార్చుకోవడం జరుగుతుంది.

హైదరాబాదులో పరిస్థితి

ఆచార్య యస్. కె. అయ్యంగార్ ౧౯౪౯—౫౦ సం. లో ౧౧౮ గ్రామాలలో ఆర్థిక విచారణలు జరిపారు. వీటి భోగట్టా సేకరించిన తరువాత ప్రతి ఒక్కరికి సగటున ౨.౫ ప్లాట్ల భూమి ఉన్నట్లు కనుగొన్నారు. తీవ్రోత్పత్తి పద్ధతిన సేద్యం చేసినట్లయితే ప్రస్తుతం వివిధ సైజులలో ఉన్న సేద్యయోగ్యమైన భూములు ఆర్థికంగా ఎక్కువగా నష్టదాయకంగా ఉన్నాయని చెప్పలేమని ఆయన అన్నారు. అయితే ప్రస్తుత పరిస్థితులను బట్టి సేద్యం పద్ధతి చాలా అధ్వాన్నంగా ఉన్నందున భూములు చెదరియుండడం వల్ల, చాలా నష్టం కలుగుతుందని కూడా ఆయన తెలిపారు. ఒక్కొక్క ప్రాంతంలో చిన్నచిన్న కమతాలు ఎంతవరకు ఉన్నాయో వాటివివరణ సేకరించిన తరవాత, కమతాల ఏకీకరణకు పూనుకోవడం సమంజసమని ఆచార్య అయ్యంగార్ సూచించారు.

వ్యవసాయ సంస్కరణల సంఘం కూడా ఈ విషయంలో కొంత భోగట్టా సేకరించింది. ఈ సంఘం ౨౭౫ గ్రామాలలో విచారణలు జరుపగా ౧౧౨౪ మంది భూకామందులకు ౮ నుంచి ౧౫ ప్లాట్లలోను ఒకనికి ౧౬ నుంచి ౨౦ ప్లాట్లలోను మరొకరికి ౨౧ నుంచి 30 ప్లాట్లలోను భూమి ఉన్నదని తెలిసింది. నల్గురికైతే 30 ప్లాట్లలో కూడా భూమి ఉంది.

హైదరాబాదు ఎకానమిక్ అసోసియేషన్ వారు కూడా మరికొన్ని గ్రామాలలో క్షుణ్ణంగా భోగట్టా సేకరించారు. ఒక్కొక్క భూకామందుకు ఎన్ని ప్లాట్లు ఉన్నది, ఈ అసోసియేషన్ తెలుపక పోయినా ఆ ప్రాంతాలలో చిన్నచిన్న భూకమతాలు ఎక్కువగా లేవని, మధ్య ప్రదేశ్, బొంబాయి, పంజాబు రాష్ట్రాలలోవలె కమతాలను ఏకీకరణం చేయడం అనవసరమని వారు సూచించారు. అయితే కమతాల ఏకీకరణను అపార్థం చేసుకొన్నందువల్ల ఈ రిపోర్టు తయారు చేయబడిందని మేము భావిస్తున్నాము. ఏకీకరణ అనేది చిన్న చిన్న కమతాలు కలిగిఉండడానికి నివారణోపాయంకాదు. అయితే అక్కడక్కడా చెదరి పడి యున్న వ్యక్తిగత కమతాలను ఒక చట్టుకు చేర్పడంద్వారా వ్యవసాయ భూముల సైసర్గిక విస్తీర్ణాన్ని చక్కచేయడమే గాని, కమతాల సగటు విస్తీర్ణంలో మాత్రం ఎచ్చు తగ్గులకు దారి ఇవ్వడం దీని ఉద్దేశం కానే

కాదు. అక్కడక్కడా కమతాలుండడం భూమి వృథా కావడం, శ్రమ ఎక్కువ కావడం, వగైరాలనూ తొలగించుటకే ఇది తలపెట్టబడింది. కనుక ఏ ప్రాంతంలోనైనా సేద్య కమతాల సగటు విస్తీరణం, భూమి ఎంతవరకు చిన్నచిన్న భాగాలుగా ఉందో తెలియజేయదు. వ్యక్తిగత ప్లాట్ల సగటు సైజు, ఒక్కొక్క భూకామందుకుగల ప్లాట్ల సగటు సంఖ్య తెలిస్తే, ఎంతవరకు భూములు చిన్నచిన్న కమతాలుగా చిట్లి ఉన్నాయో తెలుస్తుంది.

## సుమారు ౪౦ శతి భూకామందులకు లాభం

వివిధ రకాల భూసారాలు, నీటి వనరుల సౌకర్యాలను బట్టి భూగోళిక, నైసర్గిక పరిస్థితులవల్ల ఏకీకరణ ఫలితంగా ప్రతి భూకామందుకు కర్నాటక, మరాట్వాడా ప్రాంతాలలో సుమారు ౨ ప్లాట్లు, తెలంగాణా ప్రాంతంలో 3 ప్లాట్లు ఒకే చోట్లు ఉండుటకు వీలున్నదని కమీషన్ అభిప్రాయబడ తున్నది. అంటే భూమి కర్నాటక మరాట్వాడా ప్రాంతాల్లో ౨ ప్లాట్లకు, తెలంగాణాలో 3 ప్లాట్లకు ఎక్కువగా ఉన్నట్లయితే అటు భూమి ఇటు శ్రమ వృథాకాగలవన్నమాట. కమతాల ఏకీకరణవల్ల మరాట్వాడా, కర్నాటక ప్రాంతాల్లో 3౭.౨ శతి, తెలంగాణాలో ౪౧ శతి భూకామందులకు మేలు చేకూరగలదని భూకమతాల లెక్కలవల్ల తెలుస్తున్నది.

## పనికిగల అవకాశాలు

నిర్బంధ ఏకీకరణ ద్వారా గాని, సహకార పద్ధతిపైన సేద్యం చేయడం కాని లేక ఏ ఇతర పద్ధతి ద్వారాగాని ఆర్థికంగా లాభసాటిగా లేనట్టి కమతాల సమస్యలను పరిష్కరించవలసిందిగా ౧౯౪౯ సం. లో వ్యవసాయ సంస్కరణల సంఘం కోరబడింది. కో-ఆపరేటివ్ ఏజెన్సీలద్వారా సాధ్యమయినంత వరకు స్వచ్ఛంద పద్ధతుల నవలంబించి ఆర్థికంగా లాభసాటికాని కమతాలను ఏకీకరణం చేయాలని ఈ సంఘం సూచించింది. ఏదైనా ఒక ప్రాంతంలో కమతాలు విపరీతంగా చిన్నగా ఉన్నట్లయితే, వాటిని నిర్బంధంగా ఏకీకరణం చేయుటకు ప్రభుత్వానికి తగిన అధికారం ఉండాలని ఈ సంఘం భావించింది. హైద్రాబాదులో చిన్నచిన్న కమతాల దుష్ప్రభావం ఉన్నదని, ముఖ్యంగా తెలంగాణాలో తరి భూముల విషయంలో ఇవి చాలా ఎక్కువగా ఉన్నదనే భావాన్ని ఆధారంగా చేసుకొని ఈ సంఘంపై సిఫారసులు చేసింది. ఈ విషయమే భూముల లెక్కల ఫలితాలు తెలుపుతున్నాయి. అసలు నైసర్గిక పరిస్థితులకు అతీతంగా అవసరానికంటే ఎక్కువగా మొత్తం 3౬,౧౦౪౬ కమతాలు చిన్నచిన్న భాగాలుగా విభజింపబడిఉన్నాయని మేము ఇదివరకే పేర్కొన్నాము. ఇట్టి భూకామందుల శాతం తెలంగాణా లోని ౨౨ తాలూకాలలో ౪౧.౧ ఉన్నదని లెక్క కట్టబడింది.

## ప్రమాణబద్ధమైన ప్రాంతం

భూమి కనిష్ట పక్షం ఎంత పరిమాణంలో ఉండవలెనో మేము చాలా జాగ్రత్తగా పరిశీలించాము. సదరు చట్టపు ౫౪వ సెక్షన్ ప్రకారం, ఇకముందు భూపరిమాణం ఇతరత్రా విభజనకాకుండునట్లు నిషేధించబడాలి. నిర్ధిష్ట, ప్రాథమిక కమతానికన్నా ప్లాటు విస్తీర్ణం చిన్నదిగా ఉన్నట్లయితే అది చిన్నకమతముగా పరిగణించబడుతుందని సదరు చట్టపు అక్షన్ ౨లోని (హెచ్) క్లాజులో నిర్వచించబడింది. ఖుష్కీ తరి భూములకు నిర్ణయించబడిన ప్రాథమిక కమతపు పరిమాణం, సర్వే నంబర్ల మామూలు పరిమాణాలు పరిశీలించినట్లయితే, ప్రస్తుతం నిర్వచించబడిన చిన్నకమతపు పరిమాణం చాలా పెద్దగా ఉన్నదని, చిన్నచిన్న కమతాలుగా విభజనకావడాన్ని నిషేధించుటకుగల నియమావళిని అమలుపరచడం సుసాధ్యం కాదని మేము అభిప్రాయపడుతున్నాము. ఎందుకంటే భవిష్యత్తులో భూములు మార్పిళ్ళు కావడం కాని విభజనకావడం కాని పూర్తిగా నిషేధించబడాలని ఇది స్ఫురింపజేస్తుంది.

భారత దేశపు ఇతర రాష్ట్రాలలో చిన్న కమతాలను నిషేధిస్తూ తయారుచేయబడిన నియమావళి ఒక్క బొంబాయి రాష్ట్రానికి మాత్రమే వర్తింపుచేయబడింది. చిన్నకమతమంటే ప్రమాణబద్ధమైన ప్రాంతానికంటె తక్కువగా గల ప్లాటు అన్నమాట. ఇది లాభసాటిగలసేద్యం కొరకు కనిష్ఠ విస్తీర్ణంగల భూమి అని నిర్వచించబడింది. ప్రభుత్వం ఈ ప్రమాణాన్ని ఎప్పటికప్పుడు నిర్ణయించవచ్చు. హైద్రాబాదులో, ప్రాథమిక కమతానికి నిర్ణీత పరిమాణం నిర్ణయించబడింది. భూమి దీనికంటె చిన్నదిగా ఉంటే వ్యవసాయంలో ఆర్థికంగా లాభం ఉండదన్నమాట. అయితే ప్రతి కమతం వివిధ రకాల భూసారములు గల బ్లాకులలో రెండు లేక మూడు ప్లాట్లుగా ఉండవచ్చు. కనుక ప్రాథమిక పరిమాణానికన్న చిన్నగా ఉండు ప్లాటును సేద్యం చేయడం ఆర్థికంగా నష్టం వచ్చేదిగా ఉండనక్కరలేదు. ప్రాథమిక కమతం మొత్తం కమ

తాల పరిమాణాన్ని సూచిస్తుంది. అయితే చిన్న చిన్న కమతం అనే పదం ప్రత్యేకంగా ప్రతి ప్లాటును సూచించేదిగాను, పొలానికి గళ్ళు పేయడం, శ్రమ వృధాకావడం మున్నగు వాటి ఫలితంగా ఒక ప్లాటు పరిమాణాన్ని సేద్యం చేస్తే ఆర్థికంగా లాభం లేకపోయినట్లయితే అది ప్రాథమిక కమతానికన్నా చిన్న దిగా ఉన్నట్లుగాను భావించాలి. కనుక తదనుగుణంగా చిన్న కమతం అన్నదాని నిర్వచనం సవరించబడాలి. అంతేకాక ప్రమాణబద్ధమైన ప్రాంతం అనే భావంకూడా చట్టంలో ప్రవేశ పెట్టాలని మేము అభిప్రాయపడుతున్నాము.

చట్టం, ప్రమాణబద్ధమైన ప్రాంతానికన్న చిన్నదిగా ఉండు ప్లాట్లను చిన్నకమతాలని కూడా ప్రకటించాలి. అంతేగాకుండా హక్కుల దస్తావేజులో అనువైన పద్దులు వ్రాయడం ద్వారా వాటిని ఒక క్రొత్త నియమబద్ధమైన కౌల్దారీ పద్ధతి క్రిందికి తెచ్చుటకు గూడా ఒక నిబంధనచేయాలి. ఇకముందు భూమి చిన్న కమతాలుగా ఏర్పడడాన్ని నిషేధించుటకై నిబంధనలను అమలు పరచుటకై చట్టం ఒక పద్ధతిని నిర్ణయించడం అవసరం.

### పరిపాలనా వ్యవస్థ

ప్రభుత్వ శాఖద్వారా నాల్గు స్థలాలలో ౮౦ నుంచి ౧౦౦ గ్రామాలలో ఏకీకరణ కార్యక్రమాన్ని వెంటనే ఆరంభించాలని మేము సూచించినాము. ఆరంభదశలో ఈ పథకానికి ౪ ఏకీకరణ సంఘాలు (కన్సాలిడేషన్ పార్టీలు) ఉండడం అవసరం అవుతుంది. ప్రతి పార్టీలో ౧౦ నుంచి ౧౨ మంది కన్సాలిడేషన్ ఇన్స్పెక్టర్లు, ఇద్దరు కన్సాలిడేషన్ నాయబ్ తహశీల్దారు ఒక కన్సాలిడేషన్ ఆఫీసరు వుండవచ్చు. ఈ పని అంతా కన్సాలిడేషన్ డైరెక్టర్ అధ్వర్యాన జరగాలి. ఈయన కనీసం ఆరంభదశలో, నేరుగా రెవిన్యూబోర్డు క్రింద పనిచేయాలి. ఆఫీసర్లకు ముఖ్యమైన ఉద్యోగి సిబ్బంది వుండాలి. ఈ పథకానికి సాలీనా నికరం రూ. 3 ౧/౨ లక్షలు ఖర్చు కాగలవని అంచనా వేయబడింది.

కమతాల ఏకీకరణ జరుగు ప్రాంతంలో ఖర్చు ఎకరానికి రూ. ౨ మించకుండా ఉండునట్లు ఈ పనిని నిర్వహించవచ్చని ఆశింపబడుతున్నది. ఈ అంచనాపై ఎకరానికి రూపాయ రేటు చొప్పున ఏకీకరణ రుసుము (కన్సాలిడేషన్ ఫీజు) అవుతుందని మేము సూచించినాము. ఈ ప్రకారం మొత్తం అయ్యే ఖర్చులో సగానికి పైగా దీనికే అవుతుంది. మిగిలిన ఖర్చు రాష్ట్ర సాధారణ భూమ్యాదాయాలనుంచిభరించాలి. ఆఫీసర్లకు, ఉద్యోగ సిబ్బంధికి ఆరంభంలో శిక్షణ యిచ్చుటకు అదనంగా కొంత ఖర్చు అవుతుంది. ఇక్కడినుంచి కొంతమందిని బొంబాయికి పంపడంవల్ల కాని లేదా అక్కడినుంచి ఒకరిద్దరు అనుభవజ్ఞులైన వారిని ఇక్కడికి తీసుకొనిరావడంవల్లకాని వారికి శిక్షణ ఇచ్చుటకు ఏర్పాట్లు చేయవచ్చు.

### సిఫారసుల సంక్షిప్త వివరణ

ఆరంభంలో కమతాల ఏకీకరణ పని నాల్గు ప్రాంతాలలో ౨౦ నుంచి ౨౫ గ్రామాలలో జరగాలి. చిన్న చిన్న కమతముల జనాభా సాంద్రత, నీటి వనరుల సౌకర్యాలు మున్నగునవి పరిశీలించి, కరీంనగరు లేక సిద్ధిపేట, బాన్సువాడా లేక బోధన్, బీడు యాదగిరి తాలూకాలలో గ్రామాలు ఎన్నుకోబడాలి.

ఏకీకరణ పని ప్రభుత్వాధికారులు ద్వారానే జరగాలి. అట్లయితేనే పని చురుకుగాను, సమర్థవంతంగాను నిర్వహింపబడుతుంది.

వీటి పథకములను ప్రభుత్వం స్వయంగా పూనుకొని అమలు పరచాలి.

హైదరాబాదులో స్థలాలు అసమంగా ఉన్నచోట్ల ఈ పని బొంబాయి, మధ్య ప్రదేశ్‌ల పద్ధతిలో జరగాలి. గాని పంజాబులో వలె దీర్ఘ చతురస్రపు ప్లాట్లు ఏర్పాటు చేయు పద్ధతిని అవలంబించరాదు.

ఏకీకరణ రుసుము ఎకరానికి రూపాయ చొప్పున వసూలు చేయాలి. దీనివల్ల నేరుగా లాభం పొందు ప్రజలనుంచి ఈ పథకంపై ఖర్చు కాగల మొత్తంలో కొంతభాగం రాబటుకోబడాలి. భూమి చిన్నచిన్న కమతాలుగా విభజన కావడాన్ని నిషేధించుటకై ఏకీకరణకు ఎన్నుకోబడిన ప్రాంతాలకు ౧౯౫౪ సం. హైదరాబాదు కౌల్దారీ మరియు వ్యవసాయ భూముల (సవరణ) చట్టపు ౫౪వ సెక్షనును వర్తింప జేయాలి.

౧౯౫౦ సం. హైదరాబాదు కౌల్దారీ మరియు వ్యవసాయ భూముల చట్టపు ౭వ అధ్యాయానికి కొన్ని సవరణల చేయడం అవసరం.

౧. ఏకీకరణ పథకములు అమలు కాగల భూముల విషయమై ప్రాథమిక సూత్రములను నిర్వచించడం.

౨. గ్రామ సంఘాల ఏర్పాటుకు నియమావళి తయారు చేయడం.

౩. ప్రజావసరాలకై సమిష్టి భూమినుంచి భూములను రిజర్వు చేయుటకు నియమావళి తయారు చేయడం.

౪. ఏకీకరణ సూచనలకు విరుద్ధంగా ఏవైనా ఆక్షేపణలు అపీళ్ళు మున్నగునవి వస్తే వాటిని పరిశీలించుటకు నిబంధనలు చేయడం.

౫. చిన్న కమతం అన్నదానికి గల నిర్వచనాన్ని సవరణ చేసి 'ప్రమాణబద్ధమైన ప్రాంతం' అను పదాన్ని ఉపయోగించడం.

౬. ఇక ముందు భూములు చిన్న చిన్న కమతాలుగా విభజన కావడాన్ని నిషేధించుటకై గల నియమావళిని అమలు పరచుటకు అవలంబించవలసిన పద్ధతిని వివరించడం.

౭. ప్రభుత్వం కాని లేక స్థానిక పరిపాలనా సంఘంకాని భూమిని స్వాధీనం చేసుకొన్నట్లయితే, తత్ఫలితంగా భూమి చిన్న చిన్న ముక్కలయ్యే అవకాశాన్ని లేకుండా చేయుటకు నిబంధన తయారు చేయడం.

౮. ఏకీకరణ కమతాలను ఇతరులకు మార్పిడి చేయడంపై నిర్బంధాలు విధిస్తూ నియమావళి తయారు చేయడం.

౯. ఏకీకరణ పథకాన్ని అమలు పరచునప్పుడు ఏదైనా ఒక దశలో, లోపంగానీ, అక్రమంకానీ జరిగినట్లు తెలియజేయబడినట్లయితే ఆ పథకాన్ని మార్పు చేయుటకు గానీ లేక రద్దు చేయుటకు గానీ ప్రభుత్వానికి అధికారం కల్పించడం.

ఏకీకరణ పనిని క్రమేణా వ్యాప్తం చేయాలి. అంతే గాకుండా 3వ పంచవర్ష ప్రణాళిక అంతమయ్యే నాటికి రాష్ట్రమంతటా ఇది అమల్లోకి వచ్చునట్లుగా ఈ పనిని వ్యవస్థీకరించాలని మేము అభిప్రాయ పడుతున్నాము.

---

(౩౭వ పుట తరువాయి.)

ప్రతి రేడియో సెట్టును గ్రామంలో బహిరంగ ప్రదేశంలో నెలకొల్పవలసి వస్తే దాని ఖర్చును భరించుటకు రూ. ౨౫౦లు, ఒక ఇంటిలోపల నెలకొల్పవలసి వస్తే రూ. ౨౦౦ లను ముందుగానే చెల్లించవలెను. ఈ సెట్టులు డ్రైబ్యాటరీతో నడుస్తాయి. వాటిని సమాచార, పౌరసంబంధముల శాఖ ౧౯౫౬ మార్చి ౩౧వ తేదీ వరకు ఏ ఖర్చు లేకుండా, ఉచితంగానే నిర్వహిస్తుంది. ఈ తేదీ దాటిన తరువాత వాటి నిర్వహణ ఖర్చును భరించుటకు సాలీనా సమంజసమైన చార్జీ వసూలు చేయబడుతుంది.

పంచాయితీ కమిటీలు, స్కూళ్ళు, సంక్షేమ సంస్థలు, ఈ సదవకాశాన్ని వినియోగించుకొని, లాభం పొందగలవని ఆశింప బడుతున్నది. రేడియో సెట్టుల కొరకు దరఖాస్తులను హైదరాబాదు—దక్కను సమాచార పౌర సంబంధముల శాఖలోని రూరల్ బ్రాడ్కాస్టింగ్ స్కీంయొక్క రేడియో ఇంజనీరుకు పంపవలెను.

(౪౬వ పుట తరువాయి.)

**పరిశోధనలు, సర్వేలు** :—పబ్లికు వర్క్సుశాఖ ౫౫౬ చెరువుల సర్వే పూర్తి చేసింది. ఈ చెరువులక్రింద మొత్తం ౨౭,౮౪౪ ఎకరాల ఆయకట్టు వున్నది. ౫౫౨ చెరువుల అంచనాలు దాఖలు చేయబడినవి. వీటికి రూ. ౩౫.౧౧ లక్షలు ఖర్చు కాగలవు. ఈ క్రింది ప్రాజెక్టుల సర్వే పనికూడా పూర్తి చేయబడింది :—

౧. జూయియా ప్రాజెక్టు,
౨. సిరాలా ప్రాజెక్టు కాలువ
౩. ధేకూ ప్రాజెక్టు
౪. జూయియా ప్రాజెక్టు రోడ్డు
౫. అంజన్ నదీ ప్రాజెక్టు
౬. ఖోలీ రిజర్వాయర్
౭. కౌమవల్లి ప్రత్యామ్నాయ స్కీములు
౮. ఘూంధాలీ చెరువు
౯. జౌనోరీ చెరువు.

---

(౪౭వ పుట తరువాయి.)

దీర్ఘకాలిక ఋణం

దీర్ఘకాలిక ఋణముల క్రింద, రైతులకు అప్పులిచ్చుటకుగాను రూ. 3 కోట్లు కేటాయించబడినవి. ఈ అప్పులను వారు ౧౦ నుంచి ౧౫ సంవత్సరాలలో చెల్లించవచ్చు. ప్రత్యేకంగా వ్యవసాయభూములను అభివృద్ధి పరచడం, వ్యవసాయ పరికరములు, ఎలెక్ట్రికల్ పంపులు, ఇతర వ్యవసాయ యంత్రములను కొనుటకుగాను ఈ డబ్బు వినియోగించబడుతుంది. రక్షిత కౌల్దార్లు భూస్వాముల నుంచి భూములు కొనగలందులకుగాను, ఈ మొత్తంలో నుంచి అభివృద్ధి ప్రణాళికకు రూ. ౭౫ లక్షలు కేటాయించబడినవి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అంతమయ్యేనాటికి రాష్ట్రంలో సహకారోద్యమం ద్వారా జనాభాలో నూటికి ౫౧ మందికి లాభం చేకూరగలదని అంచనా వేయబడింది. అంతేగాక మొత్తం వ్యాపారంలో నూటికి ౧౦ వంతులు మార్కెటింగు సంఘాలచే నిర్వహించబడగలదని కూడా అంచనా వేయబడుతున్నది.

# ౧౮౫౭ స్వాతంత్ర్యోద్యమంలో హైదరాబాదు పాత్ర

భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ౧౮౫౭వ సంవత్సరం చాలా ప్రధానమైన ఘట్టం. కనుక ౧౯౫౭వ సంవత్సరంలో దీని శతవార్షికోత్సవాన్ని జరుపుటకు తలపెట్టబడింది. ౧౮౫౭వ సంవత్సరపు ఉద్యమంలో హైదరాబాదు వహించిన పాత్ర ఒక చిన్న పుస్తక రూపంలో ప్రచురింప బడుతుంది.

శ్రీ సేతుమాధవరావు, ఐ.ఎ.యస్. గారు ఈ విషయంలో పరిశోధనలు చేస్తున్నారు. హైదరాబాదు రాష్ట్రంలో బ్రిటిష్ వారికి సాలార్‌జంగ్ విశేష సహాయం చేసినప్పటికీ వారిని రాష్ట్రంనుంచి పారద్రోలుటకు లేదా కనీసం వారి ప్రాబల్యాన్నైనా తగ్గించి వేయుటకు ఇక్కడ అన్నివర్గాల ప్రజలు విశ్వప్రయత్నం చేశారని శ్రీ సేతు మాధవరావుగారు తెలుపుతున్నారు.

హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమ చరిత్ర సామగ్రిని సేకరించుటకై ఏర్పాటు చేయబడిన రాష్ట్ర సంఘం ౧౯౫౫ ఆగస్టు నెల ౧౬వ తేదీన సమావేశమయింది. ఈ సమావేశానికి శ్రీ కాశీనాథరావు వైద్య అధ్యక్షత వహించారు. శ్రీ గోపాలరావు ఎక్బోటే, శ్రీ దిగంబరరావుబిందూ గారలు సమావేశంలో పాల్గొన్నారు.

రాష్ట్ర సంఘపు కన్వీనరైన శ్రీ సేతు మాధవరావుగారు తాము ఇంతవరకు కొనసాగించిన పని యొక్క నివేదికను సంఘానికి అందజేశారు. హైదరాబాదు ఆంగ్లేయులతో సైనిక సంధి కావించుకున్నప్పుడు క్రీ. శ. ౧౮౦౦ నుంచే ఆంగ్లేయులకు వ్యతిరేకంగా స్వాతంత్ర్యోద్యమం తలెత్తిందనీ, అందుకు సంబంధించిన భోగట్టా లభించిందని ఆయన తెలియజేశారు. అప్పటినుంచి రాష్ట్రంలో, బ్రిటిష్‌వారి విస్తృతప్రాబల్యాన్ని ఏవగించుకున్న ప్రజలు చాలా మంది ఉండిరి.

బీరార్ దివాన్ అయిన మీర్‌ఆలం తూర్పు ఇండియా కంపెనీ వారితో సన్నిహిత సంబంధం కలిగి వుండేవాడు. కాని బీరార్ గవర్నర్ రాజా మహీపతిరాం ఇతని విధానాలను వ్యతిరేకించాడు. రెసిడెంటు, మీర్‌ఆలం ఇద్దరూ కలసి రాజా మహీపతి రాంను పదచ్యుతుని గావించారు. బీరారు గవర్నరు షోరాపూరుకు పారిపోయి అక్కడ సైన్యాన్ని సమకూర్చుగొని తిరుగుబాటు చేశాడు. నిజాం అతనిపైకి సైన్యాలు పంపించాడు. కాని, అవి పరాజయం పొందినవి. ఆ తరువాత తూర్పు ఇండియా కంపెనీ సైన్యాలు రాజా మహీపతిరాంను ౧౮౦౬ సం లో ముట్టడించి ఓడించినవి. అతను ఇందోర్‌కు పారిపోయి అక్కడ కడు దౌర్భాగ్య స్థితిలో మరణించినాడని భావించ బడుతున్నది.

హైదరాబాదులో బొలారంవద్దనున్న భారతీయ సైనిక దళములను అణగద్రొక్కుటకు కొంతమంది వ్యక్తులు ప్రయత్నించారు. తత్ఫలితంగా ఇద్దరు నవాబులైన నూరుల్ ఉమ్రా, రావురంభా నింబాల్కార్ హైదరాబాదునుంచి బహిష్కరింప బడి వారి వారి జాగీర్లలోనే ఉండుటకు ఉత్తర్వు చేయబడినారు.

క్రీ. శ. ౧౮౧౭ సం. లో సర్దార్‌ఖాన్ కొటెజాయి అధ్వర్యం క్రింద వున్న రోహిలా దళములు ఆంగ్లేయులకు సహాయంగా, మరాఠాలను ఎదిరించి పోరాడుటకు నిరాకరించినవి. రోహిలా దళాలన్ని పూనాకు వెళ్ళి ఆఖరు మహారాష్ట్ర యుద్ధంలో మహారాష్ట్రులకు సహాయపడినవి. రోహిలా నాయకుడు సర్దార్ ఖాను పీష్వాల తరపున యుద్ధం చేస్తూ రణరంగంలోనే మరణించాడు.

## ఉద్యమంలో నిజాంసోదరుడు

ఉత్తర హిందూ దేశంలో ౧౮౩౯ వ సంవత్సరంలో బయలు వెడలిన వహాబీ ఉద్యమం హైదరాబాదులోకి కూడా ప్రాకింది. దీనికి నాయకుడు మౌల్వీ సలీం. నిజాంసోదరుడైన ముబారజుద్దౌలా ఈ ఉద్యమంలో ప్రముఖ వ్యక్తి. బ్రిటిష్‌వారిని నాశనంచేసి, ముబారజుద్దౌలాను సింహాసనముపై కూర్చోబెట్టడం దీని ఉద్దేశ్యమై ఉండినది. కర్నూలు నవాబుతో

ఉత్తర ప్రత్యుత్తరములు జరుపబడినవి. హైదరాబాదులో తిరుగుబాటుదారులు లేవదీయు ఉద్యమంతోబాటు, అదే కాలంలో కర్నూలు నవాబు కూడా తిరుగుబాటు చేయవలెనని అందరు సమాలోచించుకొనిరి. కాని కుట్ర బట్టబయలు అయింది. ముబారజుద్దౌలా, అతని అనుచరులు నిర్బంధంలోకి తీసుకోబడినారు. కర్నూలు నవాబు బ్రిటిష్‌వారిని ఎదిరించి ఓడిపోయాడు. కర్నూలు వశపరచుకోబడింది. ముబారజుద్దౌలా అతని అనుచరులను విచారణ చేయుటకు హైదరాబాదులో ఒక విచారణ న్యాయస్థానం ఏర్పాటు చేయబడింది. తత్ఫలితంగా మౌల్వీకి, అతని అనుచరులకు ౧౪ సంవత్సరముల కారాగార శిక్ష విధించబడింది. ముబారజుద్దౌలా ప్రభుత్వ ఖైదీగా గోలకొండలో బంది కావించబడినాడు, అతను గోలకొండలో క్రీ. శ. ౧౮౫౪ సంవత్సరంలో మరణించాడు.

## ౧౮౫౭ విప్లవం

౧౮౫౭ సం. లో ఉత్తర హిందుస్థానములో విప్లవము ప్రజ్వరిల్లిన వార్త హైదరాబాదుకు ప్రాకింది. ప్రజలలో అశాంతి ప్రబలింది. ఈ విషయంలో ముఖ్యంగా సాలార్‌జంగ్ కృషి ఫలితంగా హైదరాబాదు ప్రశాంతంగా ఉండినదన్న విషయం నిజం కాదు. ఎందుకంటే ఈ కాలంలో హైదరాబాదు రాష్ట్రంలో వివిధ జిల్లాలలో అనేక తిరుగుబాట్లు జరిగినవని మనకు ఇప్పుడు కొన్ని విషయాలవల్ల స్పష్టంగా తెలుస్తున్నది. అప్పుడు జరిగిన సంఘటనలు ఇవి:—

౧. తుర్రేబాజ్‌ఖాన్, మౌల్వీ అల్లావుద్దీన్ అనే ఇద్దరు వ్యక్తులు ౧౮౫౭ జూలై నెలలో రెసిడెన్సీపై దాడి చేశారు. కాని ఓడి పోయారు. తుర్రేబాజ్‌ఖాన్ కారాగారమునుంచి తప్పించుకొనిపోవు సమయములో కాల్చివేయబడి నాడు. మౌల్వీ అల్లావుద్దీన్ విచారణ చేయబడి యావజ్జీవ కారాగృహ శిక్ష విధించబడినాడు. క్రీ. శ. ౧౮౮౪ సం. లో అతను అండమాన్ దీవులలో మరణించినాడు.

౨. మహారాష్ట్ర నాయకులైన నానాసాహెబు పీష్వా తాంతియాతోపేల ముఖ్య అనుయాయులు దక్కన్‌లో అల్లకల్లోలములను ఉధృతం చేయుటకు తీవ్ర కృషి చేసినారు. రాయ్‌రాయాన్ జాగీరులో ప్రముఖ ఉద్యోగిగా పనిచేస్తూవుండిన సోనాజీ పండిట్ ౧౮౫౭ జనవరి నెలలో నానాసాహెబు పీష్వాకు నార్ఖేడ్ గ్రామ పట్వారీ అయిన రంగారావు అను వ్యక్తిద్వారా ఒక జాబును పంపినాడు. రంగారావు నానాసాహెబు నుంచి ఉత్తరవులు పొందీ ఇక్కడికి తిరిగి వచ్చి నాందేడు జిల్లా దేగ్లూరు తాలూకాలోని కోలాన్‌లో ఒక కుట్ర పన్నినాడు. ౫ వేల అశ్వదళమును, ౧౦ వేల పదాతిదళమును సమకూర్చుకొని, ఆంగ్లేయులను నాశనముచేసి, నాగపూరుకు పురోగమించవలెనని ఈ కుట్ర పన్నబడింది. ఈ కుట్రలో రాజా దీప్‌సింగ్, కోలాన్‌యొక్క రాజపుత్ జాగిర్దార్, రావు రంభా నింబాల్కర్ కుమారుడు సఫ్దరుద్దౌలా భాగస్వాములు. ఈ కుట్ర బట్టబయలు కావించబడింది. వీరు పట్టుబడినారు. రాజా దీప్‌సింగ్ జాగీరు వశపరచుకోబడింది. అతనికి మూడు సంవత్సరముల కారాగారశిక్ష విధించబడింది. సఫ్దరుద్దౌలా స్థిర చరాస్తులు జప్తు కావించ బడినవి. ఆయనకు యావజ్జీవ కారాగార శిక్ష విధించబడింది. రంగారావును బ్రిటిష్‌వారు ప్రత్యేకంగా విచారించి అతనికి మరణ శిక్ష విధించారు కాని ఆ తరువాత ఈ శిక్షను తగ్గించి దానిని యావజ్జీవ కారాగార శిక్షగా మార్చివేసివారు.

## షోరాపూరురాజా

నానాసాహెబ్ పీష్వా, షోరాపూరు రాజాకు శ్రీ వెంకటప్ప నాయక్‌కు ఉత్తరువులు జారీ చేశాడు. గుల్బర్గాజిల్లా షోరాపూరులో కల్లోలం జరిగింది. వెంకటప్ప నాయక్ పై సైనిక దళములు పంపబడినవి. అతను ఓడిపోయినాడు. తరువాత హైదరాబాదులో పట్టుబడినాడు. ఇది ౧౮౫౮ ఫిబ్రవరిలో జరిగింది. వెంకటప్పనాయక్ న్యాయస్థానంలో విచారణ చేయబడినాడు. అతను బందీ కావించబడవలసిన స్థలానికి తీసుకొనిపోబడుతుండగా మార్గమధ్యంలో ఆత్మహత్య చేసుకున్నాడని చెప్పబడుతున్నది.

౧౮౫౮ జూన్ నెలలో భీమారావు దేశాయి రాయచూరు జిల్లాలో కొంత సైన్యాన్ని సమకూర్చుకొని కొప్పల్ కోటను ముట్టడించి స్వాధీన పరచుకున్నాడు. అయితే అతనిపై కిమరాళ సైన్యం పంపబడింది. భీమారావు దేశాయి ఆ సైన్యమును మూర్కొని యుద్ధంలో మరణించినాడు. అతనివెంట ౧౫౦ మంది కూడా చనిపోయినారు. షోరాపూరు, దక్షిణ మహారాష్ట్ర దేశనాయకులు కలిసి కుట్ర పన్నినారని తెలుస్తున్నది.

బీడు, బీదరు, జిల్లాల్లో పదచ్యుతి కావించబడిన సతారా వంశపు బంధువులని చెప్పుకొన్నవారు. తిరుగుబాటు లేవదీసినారు. బీడులో ఖర్దా గద్దిని పట్టుకోవడానికి కుట్రచేసిన వ్యక్తులందరూ విచారణ చేయబడినారు. వారికి కారాగార శిక్షలు విధించబడినవి.

## ఔరంగాబాదులో విప్లవ శంఖారావం

ఔరంగాబాదు కంటోన్మెంటులో భారత సైనికులలో విప్లవం చెలరేగింది. ౧౮౫౭ లో ఇది అణచ బడింది. విప్లవ నాయకులు ఉరి తీయబడినారు.

౧౮౫౮ సం. లో ఔరంగాబాదు జిల్లాలోని పైజాపూరులో గోవిందరావు కాశీరాజ్ దేశపాండే ౨౦౦౦ మంది భిల్లులను సమకూర్చుకొని కల్లోలాలు చేయడం ఆరంభించినాడు. ఔరంగాబాదులోని సైన్యములతో యుద్ధం జరిగింది. అందులో ౪౦ మంది భిల్లులు తమ ప్రాణాలు కోల్పోయినారు. గోవిందరావు దేశపాండే బంది కావించబడినాడు. అయితే విచారణ జరుగుతూండగానే అతను మరణించాడు.

నానాసాహెబు పీష్వా, తాంతియాతో పేల క్రింద ఉండిన రోహిలాలు దక్కన్‌పైకి నడిచి అజంతాను పట్టుకొన్నారు. అయితే వారు తరువాత పరాజయం పొందినారు. వీరిలో చాలామంది పర్భని జిల్లా బస్మత్ తాలూకాకు చెందర వందరగా పారిపోయి అక్కడ జాల్నా జాగిర్దారు శరణు జొచ్చినారు. అక్కడ కూడా యుద్ధం జరిగింది. జాల్నా జాగిర్దారు బంది కావించబడి, యావజ్జీవ కారాగార శిక్ష విధించ బడినాడు.

## బ్రిటిష్‌వారిపై గోండుల పోరాటం

ఆదిలాబాదు జిల్లాలో గోండులు బ్రిటిష్‌వారిపై దాడి చేసినారు. గోండులకు సహాయంగా రోహిలాలు వచ్చినారు. ఉట్నూరు తాలూకాలో యుద్ధం జరిగింది. రాంజీగోండ్ నాయకత్వం క్రింద గోండులు పోరాడి, పరాజయం పొందినారు. రాంజీగోండు పట్టుబడినాడు. ఆ తరువాత నిర్మల్‌లో ఉరి తీయబడినాడు. అతను ఉరి తీయబడిన చెట్టు నేటికి, రాంజీ గోండు చెట్టు అను పేరుతో నిలిచియున్నది. నానాసాహెబు కుటుంబానికి చెందిన రావుసాహెబు అను వ్యక్తి దక్కనులో కొంతకాలం ఉండి తిరుగుబాటు లేవదీసినాడని చెప్పుటకు ఆధారమున్నది. నిర్మల్‌లో వెంకటరావు యొక్క సంపన్న కుటుంబీకులు ౧౮౫౮ సం. లో పీష్వాకు శరణు ఇచ్చిన కారణంగా తమ జాగీర్లు పోగొట్టుకున్నారు. పై విషయాలను పరిశీలించినట్లయితే ౧౮౫౮ సం. లో ఈ రాష్ట్రంలో అల్లకల్లోలాలు తీవ్రంగా వుండినట్లు తెలియగలదు.

రాష్ట్ర కమిటీ కన్వీనరు ఆ తరువాత జరిగిన కల్లోలాలను పేర్కొన్నారు. ౧౮౬౭ సం.లో భాల్కి కుట్ర జరిగింది. ఇందులో ప్రముఖ వ్యక్తి రాంరావు. ఇతను సతారా కుటుంబానికి చెందిన వాడని చెప్పబడుతున్నది. సతారాను తిరిగి రాబట్టుకొనుటకు ఇతను కృషి చేసినాడు. కాని పట్టు బడినాడు. పాలకులు అతనికి యావజ్జీవ కారగార శిక్ష విధించి, అండమాన్ దీవులకు పంపినారు.

౧౮౯౯ సం. లో బాబాసాహెబ్ అను వ్యక్తి బ్రిటిష్‌వారిని పారద్రోలు ఉద్దేశ్యంతో బీడుకు పోయి కొంతమంది ప్రజలను కూడగట్టుకొన్నాడు. క్రీ. శ. ౧౮౯౯ ఏప్రిల్ ౧౪వ తేదీన బాబా సాహెబ్ అనుచరులకు సిపాయీల దళములకు యుద్ధం జరిగింది. తత్ఫలితంగా చాలా మంది ప్రజలు మరణించారు. బాబా తప్పించుకొని పారిపోయాడు. ఎక్కడికి పోయినాడో తెలియదు.

## విప్లవ కార్యకలాపాలు

కన్వీనరుగారు హైదరాబాదులో కొనసాగించబడిన స్వదేశీ ఉద్యమం ఆందోళనను గూర్చి వివరించి చెప్పారు. హైదరాబాదులోని విప్లవ కార్యకలాపాలను గూర్చి కూడా ఆయన పేర్కొన్నారు. క్రీ. శ. ౧౯౦౯ సం. లో నాసిక్ కలెక్టరు జాక్సన్‌ను హత్య చేయుటకు ఔరంగాబాదులో కుట్ర పన్నబడిందని ఆయన ఉదాహరణంగా పేర్కొన్నారు. ప్రముఖ మహారాష్ట్ర విప్లవనాయకుడు సేనాపతి బాపట్ కొన్నేండ్ల వరకు ఔరంగాబాదు జిల్లాలో తలదాచుకొన్నాడు. విష్ణు పింగ్లే అను మరొక మహారాష్ట్ర విప్లవయోధుడు చాలా కాలం ఉస్మానాబాదు జిల్లాలో ఔసాలో ఉండినాడు పూనాలో అనేక మంది యూరోపియన్ అధికారుల హత్యతో సంబంధంగల బాలకృష్ణ హరి ఛాఫేకర్ రాయచూరు జిల్లా, కొప్పల్ తాలూకాలో తలదాచుకొని యుండగా బంది కావించ బడినాడు.

## ౧౮౫౭ ఉత్సవము

క్రీ. శ. ౧౮౫౭ స్వాతంత్ర్య విప్లవంలో హైదరాబాదు వహించిన పాత్రకు సంబంధించిన భోగట్టాను సకాలంలో సేకరించి ౧౯౫౭ సం. లో శత వార్షికోత్సవంలో మన రాష్ట్రం పాల్గొనుటకు అన్ని సిద్ధం చేసి ఉంచాలని కోరుతూ ముఖ్యమంత్రిగారు కమిటీ అధ్యక్షుణ్ణి ఉద్దేశించి వ్రాసిన లేఖ సమావేశంలో చదవబడింది. ఇందుకు సంబంధించిన వివరాలన్నిటిని ౧౯౫౬ జూన్ లోగా సేకరించి పుస్తకరూపంలో ప్రచురించాలని కమిటీ నిర్ణయించింది. జిల్లా గజెటీర్లను కూర్పు చేయుటకు కూడ కమిటీ నిర్ణయించింది.

---

“శ్రేయోరాజ్య పథంలో”

***

హైదరాబాదు రాష్ట్రములో

ప్రథమ

పంచవర్ష ప్రణాళిక

ప్రగతిని

తెలిపే పుస్తకము

***

వెల రూ. -౦/-

భూదానం

ప్రేమ మార్గం ద్వారా భూమిని

పంపిణీ చేసేవిధానం

***

వివిధ రచయితలు

ఆచార్య వినోబాభావే

కార్యక్రమమునుగూర్చి

ప్రశంసాపూర్వకంగా వ్రాసిన పుస్తకము

***

పుస్తకములో ఎన్నోఛాయా చిత్రాలుకలవు

వెల రూ. ౧/-

ప్రాప్తిస్థానం:

సమాచార పౌర సంబంధముల శాఖ

హైదరాబాదు



బొల్లారంలో “రాష్ట్రపతి నిలయం” ఏర్పాటుకావడం హైదరాబాదు భవిష్యత్తుకు శుభసూచకం.